

# కార్యక్రమాలు - కార్యాచరణ

(కొన్ని గుర్తుండిపోయే సందర్భాల స్మృతులు)

గౌరవ్

# అంకితం



పాలకుల వైకల్యానికి బలైపోయిన
అవిశ్రాంత నిరసన స్వరం
అజరామర ప్రజాపక్ష గళం,

ప్రొఫెసర్ **'జి. ఎన్. సాయిబాబా'** ఆశయ స్ఫూర్తికి,

మనస్ఫూర్తిగా...

## ముందుమాట

ఒక దశాబ్ద కాలంగా అప్పుడ ప్పుడు చేసిన కొన్ని కార్య క్రమాల నమోదు ప్రక్రియ ఈ పుస్తకం. ఐతే,సమగ్రం మాత్రం కాదు, అలాగని సంక్షిప్తమూ కాలేదు. కొన్ని విశిష్టమైన కార్యాచర ణల్ని ఇలా చేసిన పరిచయం వరకే దీని పరిధి. అంతవరకే ఇది పరిమితమని గుర్తించ మనవి.'కరపత్రాల కథా కమామీషు' వర్క్ కి ముందు నేను చేసిన/పాల్గొన్న కార్యక్రమాల వివ రాలు లేవు.అలాగే, మద్యపాన వ్యతిరేక ప్రచారోద్యమానికి సంబం ధించిన రిపోర్టులు లేవు. అలాగే, ఏకంగా సాంస్కృతిక రాజధాని రాజమహేంద్ర వరంలో తల పెట్టిన వాటిని చేర్చలేదు.రాజమహేంద్రవరం కందుకూరి వీరేశలింగం గారి టౌన్ హాల్‌లో చేసిన పలు సమావేశాలు మొదలు, అమలాపురంలో కోనసీమ ఫిల్మ్ సొసైటీ ఆద్వ ర్యంలో జరిపిన ప్రత్యామ్నాయ ఫిలిం ఫెస్టివల్ అలాగే కాకినాడ గాంధీభవన్‌లో చేసిన మహిళా సభ వివరాలు లేవు.ఉత్తరాంధ్ర ప్రాంతాల్లో ఏళ్ళ తరబడి వివిధ సంఘటనల్లో సమిష్టిగా పాల్గొన్నా సరే, ఆయా సమాచారాన్ని భద్రపర్చుకోలేక పోవడం నా లోపం. భావోద్యమాల కోసమని కాళ్ళరిగేలా తిరిగినన్నాళ్ళు అసలీ రికార్డు అవసరమనే భావనే కలగకపోవడం విచిత్రం. అంతకంటే దురదృష్టం తెలం గాణ నల్గొండ జిల్లాలో, వికారా బాద్ ప్రాంతంలో చేసిన కార్యా చరణ తాలూకా వివరాల్ని కనీసం నమోదు చేసుకునే ప్రయత్నం చేయక పోవడం. ఆ చేసిన వరకూ కాలగర్భంలో కలిసిపోవడం. కాబట్టి, ఇప్పుడిక చింతించి ప్రయోజనం లేదు. ఆచరణాత్మకతను అక్షరాల్లో నింపి నినదించిన ఆయా సందర్భాల సగటు సారమే ఈ పొత్తం. అనుబంధంగా ఈ మధ్య కాలంలో క్రియాశీల పాత్ర వహిస్తున్న ఇరు సంఘాల పరిచయం ఇవ్వడం జరిగింది. చదివాక మీ సూచనలకు, విమర్శలకు ఆహ్వానం.

# కొన్ని తరాలు - కొన్ని స్వరాలు

## (నేను సందర్శించిన సమున్నత శిఖరాలు)



జనవరి 2015 లో అంటే ఎనిమిదేళ్ళ క్రితం వచ్చిన నా మొదటి భావోద్యమకారుల ఇంటర్వ్యూల పుస్తకం "ధిక్కార స్వరాలు" ఒక మరపురాని జ్ఞాపకం. భిన్న స్రవంతులకి చెందిన మహోద్యమ స్వరాల్ని ఒక్క దరికి చేర్చి నేను రూపొందించిన తొలిఇంటర్వ్యూల పుస్తకం. తెలుగులో అనితరసాధ్యమైన అంకిత భావం కలిగిన కొందరి చివరి స్వరాలు రికార్డు చేయగలగడం నా వరకూ నాకొక గొప్ప పనే !

అదే ఏడాది తీసుకువచ్చి సరిహద్దు గాంధీ 'ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్' కి అంకితం ఇవ్వబడిన గాంధేయవాదుల ఇంటర్వ్యూలు "విస్మృత స్వరాలు",అలాగే డా.బాబాసాహెబ్ అంబేద్కర్ కి అంకితం ఇచ్చిన వివిధ బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు " సద్ధమ్మ స్వరాలు" కూడా ఎందరో విస్మరించబడిన ఆలోచనాపరులు, అంకిత భావంతో పనిచేసే కార్యకర్తల్ని అనేక పరిమితుల్లో అయినా, సామాజిక కార్యరంగానికి పరిచయం చేయగలిగినందుకు ఆనంద పడుతుంటాను!

ఆ తర్వాత సరిగ్గా ఏడాదికి జనవరి 2016 కి ప్రచురించిన "ధీరోదాత్తులు"(కొందరు సామాజిక కార్యకర్తల పరిచయాలు) బి.డి.శర్మగారి స్మృతి చిహ్నంగా ఇప్పటికీ నాకెంతగానో తృప్తినిచ్చే ప్రాజెక్ట్ ఇది. తర్వాత 2017 లో అసామాన్య పర్యావరణ వేత్త కీ. శే. సుందర్లాల్ బహుగుణగారిని ప్రత్యేకంగా డెహ్రాడూన్ వెళ్ళి కలిసి విమలా బహుగుణా జీతో సహా ఇంటర్వ్యూ చేసి ప్రచురించిందే జార్జ్ జేమ్స్ రచన 'ప్రకృతి శాశ్వత ప్రగతి' వర్క్ !

ఇక 2019 సంవత్సరంలో తెచ్చిన, "మరువలేని మనుషులు – మరపురాని జ్ఞాపకాలు" (కొందరు గతించిన ఆత్మీయుల స్మృతులు) భారమయిన రచన. ఇంకా ఇంటర్వ్యూ చేసి నోట్స్ రాసుకుని కూడా ప్రచురించలేకపోయిన మహానుభావులు ఎందరో ఉన్నారు. అప్పట్లో బొత్తిగా అస్థిరమైన జీవనయానంలో అలాంటి ఎన్నో స్మృతులు పోగొట్టుకున్నాను. అందుకు

నాకు నేనెప్పటికీ క్షంతవ్యుడ్ని కాను. ఇతరేతర భావోద్యమాల్ని అంటే, సంస్కరణవాద శాఖలు మొదలు  వామపక్ష విప్లవోద్యమం వరకూ, కళాకారులు అనేక మంది ఇంటర్వ్యూల పని అలాగే మిగిలిపోయింది !

ఇవన్నీ భావితరాలకు భావోద్యమాల్ని ఎంతో కొంత పరిచయం చేయాలనే తపనా, సామాజిక కార్యాచరణ రంగంలో కృషి చేసిన వారి భావాలకి, నా పరిమితుల్లో ప్రజా ఉద్యమ స్వరాలకి కనీసం నమోదు (%ణశీషబఎవఅ్‌ఱశీఅ%) అవసరమనే ఆతృతతో ప్రయాణమే ప్రస్థానంగా కాలికి చక్రాలు కట్టుకు తిరిగి చేసినవే. అప్పటికీ ఇప్పటికీ కూడా నావన్నీ చేయకాల్చుకునే సొంత ప్రాజెక్టులే తప్పా వెనక వెన్నెముక తప్పా మరేమీ లేదు. ఐనా, ఇవన్నీ కేవల వ్యక్తిత్వాలు కావు, కొన్ని సమాజ వికాసం కోసం జీవితాంతం పరితపించిన సమున్నత శిఖరాలు !

చాలా కారణాల వల్ల ప్రయాణాలు తగ్గాయి. %×త్‌వత్ఱఖ్షఱశీఅం% లేవు. తెలుగు సమాజంలో కొత్త ఆవిష్కరణల కోసం స్వప్నించిన ఒక కలం కాలం జడిలో కలగా ఉండిపోయింది. ఏవో ఈ మేరకు కొద్దిపాటి ప్రయత్నాలు చేయగలిగాను. ఇప్పుడిక ప్రతీ పనికీ ఆలోచించాల్సిన పరిస్థితి వచ్చేసింది. చేయాలని పూర్తి చేయలేకపోయిన అసంపూర్ణ కార్యక్రమాల పట్ల అసంతృప్తి పెద్దగా ఏమీ చేయలేకపోయాననే ఎరుకను నిరంతరం యాదిలో ఉంచుతుంది. అదే ఎప్పుడైనా నిద్రలేపే ఎడతెరిపిలేని ఒడిదుడుకుల చైతన్యానికి సుస్థిరమైన నిర్మాణం దిశగా ఒక కొనసాగింపునిస్తుంది!

(విశాఖపట్నం నుండి ఎవరో ఫోన్ చేసి ధిక్కార స్వరాలు, సద్ధమ్మ స్వరాల గురించి అడిగారు. బౌద్ధ ఇంటర్వ్యూలు వెతికినా దొరకలేదు. సాఫ్ట్ కాపీ కూడా లేదు. వీటిలో ఉన్నవేవో చూసి కాస్త భద్రపరచడం, వ్యక్తిగతంగా నాకు కాకున్నా ప్రజాఉద్యమ స్రవంతుల్ని అధ్యయనం చేయడం ఒక చారిత్రక ప్రాధాన్యత కలిగిన కార్యక్రమంగా గుర్తించే శ్రేణులకి సాంస్కృతిక అవసరం అని భావిస్తూ ఆ అజరామర స్వరాలకి మద్దతుగా పాత జ్ఞాపకాలని గుర్తు చేసుకుంటూ ఈ చిన్న రైటప్.)

# చీకటి రాత్రులు - వేకువ వెలుగులు

## (నేను రాసిన తొలి అక్షరాల జాడలు)



ఎన్ని చెప్పండి, దాటొచ్చిన కాలం నాటిన గుర్తులు, జ్ఞాపకాల దొంతరలో నుండి అంత త్వరగా తుడిచిపెట్టుకు పోవు. తప్పటడుగులే కానివ్వండి, తప్పులే చేయనివ్వండి. కానీ, ఒకనాడు తగిలిన గాయాల చారికలు గతాన్ని అనుకున్నంత త్వరగా వీడవు. నిత్యం నన్ను నేను నిర్మించు కోవడం కోసం అంతరాత్మని దహించుకున్న ఎన్నో నిద్రలేని రాత్రుల సాక్షిగా, అన్వేషించిన వేకువ వెలుగులు అనేకంగా అభివ్యక్తమయి కాని సమసిపోవు !

ఇవన్నీ నా తొలిరోజుల అక్షరాలు, సంఘర్షణలో నుంచి పుట్టిన పుస్తకాలు. కడుపు చేతపట్టుకుని ఉద్యోగం పేరిట ఏదో పనిని వెతుక్కుంటూ వెళ్ళి అక్కడ ఎంతో కాలం ఇమడలేక తిరిగొచ్చిన సందర్భాలు ఎన్నో వీటిని చూస్తుంటే ఇప్పుడు గుర్తు కొస్తున్నాయి. అరాజకత్వ అధ్యయన కేంద్రం (Center For Anarchist Studies) పేరిట ప్రజా ప్రచురణలు, శ్రమైక్య ప్రచురణలు పెట్టి ఈ అరడజను పుస్తకాల్ని ప్రచురించి పంచే నాటికి నిజానికి నాకో నిర్దిష్టమైన నిర్మాణాత్మకత లేదు !

1. ప్రజాస్వామ్య పతనం (Decline Of Democracy)
2. అరాజకత్వం అంటే ఏమిటి ? (What is Anarchism )
3. సాంఘిక తత్వం – వైప్లవ మార్గం (Social Philosophy: Revolutionary Way)
4. ప్రజాస్వామ్య ప్రస్థానం (The Journey Of Democracy)
5. ఒక నాస్తికుడి నామా (Testament of Atheism)
6. అస్థిత్వం – అరాజకత్వం (Existence - Anarchism)

అన్నీ 2010 – 12 లో ప్రచురించినవే. వీటిల్లో మూడింటికి రాసిన ముందుమాటల్లో కర్నాటక లోని బెంగుళూరు, ఉత్తరా ఖండ్ లోని శ్రీనగర్,అస్సాం గౌహతి లో ఉంటూ

రాసినట్టుంది. ప్రచురణ పిఠాపురం నుంచే. తర్వాత కాలంలో ఎన్ని విధాలా ప్రజా సంఘాల పక్షిగా తిరిగినా, జనాందోళనల జలపాతాల్లో ఒదిగినా, ఎన్ని భిన్న అభిప్రాయాలతో వివిధ సంకలనాలు, గ్రంథాలని ప్రచురించినా మన ఆరంభ అక్షరాల్లోకి ఆవాహన కావడముంది చూసారూ, ఆ అనుభూతి తీరే వేరు !

వీటిలో దేనికీ సాఫ్ట్ కాపీ లేదు. హార్డ్ కాపీలు కూడా కొన్నుంటాయంతే. అప్పట్లో ఏయే సందర్భాలలో వీటి పరిచయం జరిగిందో నిజంగానే గుర్తులేదు. ఎన్నో జ్ఞాపకం పెట్టుకునే మనసుకి సొంత అక్షరాలంటే ఎంతలుసో అని ఆశ్చర్యం కలుగుతుంది. పాతపుస్తకాల్లో దొరికిన ఈ పాత జ్ఞాపకాల్ని మళ్ళీ ఇలా ఒకసారి ప్రేమగా గుర్తు చేసుకోవడం, జీవిత రచనలోకి కొత్తదనాన్ని ఆహ్వానించడంలో భాగమనే నా భావం !

(పదేళ్ళ క్రితం అచ్చేసిన ఈ అక్షరాల్ని ఇప్పుడు అనుకోకుండా ఇలా పరామర్శించాల్సి వచ్చింది. వీటి కారణంగా దగ్గరైన మిత్రులు, దూరం కాబడ్డ అమిత్రులకూ కొదవలేదు. ముఖ్యంగా, భావోద్యమాల్లో నాకంటూ ఒక స్థానం కల్పించినవి ఈ ఆరంభాక్షరాలే. ఈరోజు వీటితో భిన్నాభిప్రాయాలు ఉండొచ్చుకానీ, %ర్అశ్రీశ్రీ × రాశీజవ్ష్ట్రవంవ షశీతీఎం%. చదూతూంటే ఈనాటికీ అక్షరాల్లో ఆవేశం చల్లారలేదని అనిపిస్తుంది. అందుకే, వీటికోసం ఈ చిన్న రైటప్.)

# కరపత్రాల ఊసులు - కార్యాచరణ బాసలు

## (రాసిన అక్షరాల తాలూకా ఆచరణలు)








ఒకనాడు నేనెంతో ఆవేశంతో రాసిన అక్షరాలు ఈ రోజు అపురూపంగా అనిపిస్తాయి. వ్యవస్థలో లోపాల్ని, అక్రమాల్ని, అన్యాయాల్ని చూడలేక, చూస్తూ మౌనంగా ఉండలేక సంవత్సరాల క్రితం యువ రక్తంతో,నూతనోత్తేజంతో చేసిన కలం యుద్ధాల కారణంగా ఎదురయిన ఎన్నో చేదు అనుభవాలు, అన్నే మధురానుభూతులు !

కులక్రౌర్యాన్ని, మతమాలిన్యాన్ని, లింగవివక్షని, ఇంకా సమాజంలో నెలకొన్న అన్ని రకాల అసమానతల్ని ఎండగడుతూ, విదిలించిన ఎన్నో కరపత్రాలు ప్రజానీకంలో నదిలా ప్రవహించి వెల్లువెత్తిన కాలాలు, వాటి వల్ల ఇంటా, బయటా చుట్టు ముట్టిన హెచ్చరికలు, బెదిరింపులు, శాపనార్థాలు !

ప్రత్యామ్నాయ ఉద్యమ స్రవంతుల్ని పని కట్టుకుని అధ్యయనం చేసే పని గురించిన బీజం బహుశా అప్పుడే నా మనసులో పడుండాలి. ప్రజాతంత్ర క్షేత్రాలని అదేపనిగా వెతుక్కుంటూ తిరిగిన అనుభవాలు, అందుకే విశాలమైన ఒక తాత్విక భూమికని సారవంతం చేయడానికి నా అన్వేషణలో ఉపయోగపడుండాలి !

ఒక్కొక్క కరపత్రానిదీ ఒక్కో చరిత్ర. ఒక్కో చరిత్రకీ ఒక్కో కార్యాచరణ, ప్రతీ కార్యాచరణ ఒక సమిష్టి వ్యక్తీకరణ యొక్క అభివ్యక్తి. నాటి రూపం లోక కళ్యాణం. ఒక వికసిత వ్యవస్థ కోసం జరిగిన సంఘర్షణే వాటి సారం. ఎన్నడో పదిహేనేళ్ళ క్రితమే పెట్టిన "ప్రజాస్వామ్య పరిరక్షణ వేదిక – ప్రజ" నుండి, 'అరాజకత్వ అధ్యయన కేంద్రం' దాకా, ఎన్నో అడుగులు

!

“కరపత్రాల కథా కమామీషు” లో పుస్తకరూపం ధరించినవే కాక ఇంకా లెక్కలేనన్ని తిరుగుళ్ళూ, సమయం, సందర్భం లేని సర్దుళ్ళ వల్ల, అస్థిర జీవితంలోని ఆటుపోట్ల అల్లకల్లోలంలో నేను కోల్పో యిన అక్షరాల జాడలెన్నో. ఎడతెరిపి లేని పోరాటాల సుడిగుండాలు సృష్టించిన సునామీ ఉప్పెనల అమాంతమైన జల్లులకి అమాంతం మాయమైపోయి కాలగర్భంలో కలిసిపోయిన ఆ చిరకాల కన్నీటి కలం కలలెన్నో !

(ఇటు ఆంధ్రా యూనివర్సిటీ నుండి మొదలెడితే అటు ఉస్మానియా విశ్వవి ద్యాలయం వరకూ అదే పనిగా ఆంధ్రా, తెలంగాణలో అక్షర సేద్యం చేస్తూ భావోద్యమాలకి బాసటగా నిలిచిన కలం పై ప్రేమతో , మిగిలిపోయిన కరపత్రాల్ని ఓసారి ఆత్మీయంగా స్పృశిస్తుంటే, దాచుకున్న గత కాలపు ఊసులెన్నో తలంపుకొచ్చాయి. గడిచిన దినాల బాసల్ని జ్ఞప్తికి తెచ్చాయ్. వాటి మధ్య సంచరిస్తూ నాటి సంఘర్షణల నేపథ్యాన్ని సంక్షిప్తంగా ఇలా ....)

# నవతరం ఉద్యమ ఆవాహనం!

## నాటి యువ సమ్మేళనం !!


యువ సమ్మేళనం

ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక ఆద్వర్యంలో సరిగ్గా ఐదేళ్ళ క్రితం విజయవాడలో జరిగిన ఒక మంచి నిర్మాణాత్మక కార్యక్రమం ఈ యువ సమ్మేళనం. జాతీయ స్థాయిలో ఉత్తర భారతం లో జరిగిన యువ సమ్మేళన్ ప్రేరణతో విభిన్న స్రవంతులకు చెందిన కొద్ది మంది యువ మిత్రులం కలిసి పాలు పంచుకున్న అద్భుతమైన క్రియాశీల ప్రయత్నమిది !

రాజేష్, రోహిత్, రాహుల్, బాలు, మీరా, నేనూ ఇంకా ఇతర మిత్రుల ప్రోత్సాహంతో ఆనాడు సమష్టి కృషితో రెండు రోజులపాటు జరిగిన ఈ కార్యశాలలో రెండు తెలుగు రాష్ట్రాల నుండి ఎంతో మంది ఉత్సాహ వంతమైన యువత ఉత్తేజంతో పాల్గొన్నారు. వర్తమాన సమస్యల గురించి అనేక దార్శనిక చర్చలు విమర్శనాత్మక ధోరణిలో జరిగాయి !

కులతత్వం, మతోన్మాదం, విద్యార్థులు, రైతుల ఆత్మహత్యలు, పురుషాధిక్యత, లింగ వివక్ష, ఇలాంటి అంశాల మీద అనూహ్యమైన రీతిలో సంవాదాలు సాగాయి. తర్వాత కోవిడ్ మొదలు అనేక వ్యక్తిగత అనివార్య అనారోగ్య కారణాల వల్ల అనేక సంఘాల్లా గానే ఎన్. ఎ. పి. ఎం.లో కూడా ఏక్టివ్‌గా ఉండలేక పోయాను !

కానీ హైదరాబాదు లక్డీకాపూల్ ఆఫీస్ కేంద్రంగా ఉంటూ, అటు ఉత్తరాంధ్రలోని కొవ్వాడ అణు విద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా సరస్వతి కవుల గారితో కలిసి వెళ్ళడం మొదలు, కరీంనగర్ లోని గోదావరిఖని బొగ్గు గనుల్లోకి రాజు గారితో చేసిన ప్రయాణం వరకూ అక్కడున్న రోజులన్నీ ఎంతో నేర్చుకోవడానికి, నన్ను నేను మార్చుకోడానికీ అనునిత్యం ఉపకరించిన అనుభవాలే !

అవన్నీ ఇంకెప్పుడయినా వివరంగా రాస్తాను కానీ, ఇప్పుడీ సంగతి ఎందుకంటే, అయిదేళ్ళ క్రితం ఆనాటి సమావేశానికి మిత్రుడు బాలు బలవంతం చేస్తే రాసిన కరపత్రం ఇప్పుడిలా కంటబడింది. తరచి చూస్తే ఈరోజు కూడా అందులో ప్రస్తావించిన సమస్యల్లో

పెద్దగా మార్పేమీకనబడలేదు. పైగా ప్రజానీకంలోకి తీసుకువెళ్ళాల్సిన అవసరం పెరిగింది!

అందుకే, ఆ పాత వాసనల్ని మళ్ళీ మరోసారి గుర్తు చేసుకుంటూ, నిష్క్రియాత్మకతలోంచి బయటపడటానికి, ఆ ఉత్తేజభరిత క్షణాల్లోకి సజీవంగా ప్రవించి చైతన్యంతో స్వచ్ఛందంగా

ఘనీభవించడానికి, శివసాగర్ అన్నట్లు, ఆ క్షణాన్ని సాగదీసి కాగడాగా వెలిగించేందుకే

ఈ ముచ్చట్లు, మురిపాలు !

(ఎవరి పనుల్లో వాళ్ళుం పడిపోయినా ఆనాటి సమ్మేళనాన్ని సక్రియాత్మకంగా కొనసాగించాలని ఉంటుంది. కోవిడ్ కారణంగా అంతర్జాలంలో జరుగుతున్న యువ సమావేశాలు మంచివే కానీ, తెలుగు రాష్ట్రాల్లో ఈ రకమైన ప్రజా శ్రేణుల్ని బలోపేతం చేసుకోవాల్సిన అవసరం ఇంకామిగిలే ఉందన్న ధ్యాసతో ఈ రైటప్.)

# ఒక సదస్సు - కొన్ని సమాలోచనలు !

"సాంస్కృతిక పునరుజ్జీవనం - ఈనాటి తక్షణ కర్తవ్యం" అనే అంశాన్ని గురించి తూ. గో. జిల్లా కాకినాడ లో జరిగిన సమాలోచనా సదస్సు నాకు తెలిసీ ఈ తరహాలో తెలుగు రాష్ట్రాలలో మొట్టమొదటిది. ఇదో ప్రయోగం. సాంస్కృతిక మార్పు కోసం గెలుపోటముల తో సంబంధం లేకుండా చేసి తీరాల్సిన ప్రయోగం. గమ్యం చాలా సుదీర్ఘమైనదే , ఆటు పోట్లు పడరాని పాట్లు మాకు అలవాటే. ఐనా సరే, మార్గం ఎంత









ముఖ్యమో మాకు తెలుసు. అదే చరిత్ర ని మలుపు తిప్పే మజిలీ అని కూడా తెలుసు. కేవలం బుద్ధిజీవులకి మాత్రమే పరిమితం ఐన ఒక సంక్లిష్టమైన అంశాన్ని సామాన్య ప్రజలలో చర్చకు పెట్టడం ఒక ఎత్తయితే, అందుకోసం ఆసక్తితో రెండు తెలుగు రాష్ట్రాల నుండి ఎన్నో వ్యయప్రయాసలకోర్చి ఎంతో మంది ఈ సమా వేశానికి రావడం మరో ఎత్తు. మేమనుకున్న మానవవాద మజిలీకి తిరుగులేని బిజిలీ (విద్యుత్తు) అందించిన సమాలోచన ఈ సాంస్కృతిక పునరుజ్జీవనం - ఈనాటి తక్షణ కర్తవ్యం !

ప్రసంగాలు కావవి, ప్రవాహాలు. సాంస్కృతిక పునరుజ్జీవ నోద్యమ ప్రాసంగికతని స్పష్టం చేసిన ధిక్కార స్వరాలు. భారతీయ సాంస్కృతిక స్రవంతిని విశ్వమానవ క్షేత్రంలో భాగం చేసిన స్ఫూర్తిదాయక భావోద్వేగాలు. శతాబ్దాల మానవ పరిణామ చరిత్ర నుండి మొదలు పెట్టి, వర్తమాన సామాజిక ముఖ చిత్రాన్ని ఆవిష్కరించడం వరకూ ఏదో ముందుగానే సమన్వయం చేసుకున్నట్లు అద్భుతంగా మాట్లాడి, 'అభివ్యక్తి' యొక్క అంతిమ లక్ష్యం, ఆధునిక సంస్కృతి నిర్మాణ ధ్యేయం, అణగారిన ప్రజల పక్షాన నిలవడమేననీ, అసమానతలు లేని ప్రజాతంత్ర సంస్కృతి ని నిర్మించడమేననే సందేశాన్నిచ్చిన వక్తలు కె. పద్మ (విశాఖపట్నం), భార్గవ (కర్నూలు) , కొప్పర్తి (తణుకు), వేణు గోపాల్ (హైదరాబాద్) లకి ప్రత్యేక అభినందనలు !

హైదరాబాద్ నుంచి ఆలిం డియా ఫార్వర్డ్ బ్లాక్ స్టేట్ సెక్రటరీ పెద్దలు సుందర్రామ రాజు మొదలుకొని భద్రాచలం నుంచి వచ్చిన మిత్రుడు శ్రీను వరకూ, జంగారెడ్డిగూడెం నుండి వచ్చిన చిరకాల మిత్రుడు ఎమ్మెస్ నుండి వైజాగ్ నుంచి వచ్చిన డా. రమేష్, భూపతి అజయ్ వరకూ , కృష్ణాజిల్లా పెడన నుండి శాంతారావు, సింగ రాయకొండ మిత్రులు సి. ఎ. ప్రసాద్., ఏలూరు నుండి రామకృష్ణ.నర్సీపట్నం నుండి రమణ తదితరులు.స్థానికంగా డా. స్టాలిన్, గ.నా.రా., జానకీరాం చౌదరి , పెద్దింశెట్టి, అద్దేపల్లి ప్రభు, వంటి సాహితీ మిత్రులు, ఇంకా స్వచ్ఛందంగా కార్యక్రమంలో పాలుపంచు కున్న లెనిన్ బాబు, హరి, సిద్ధూ, తోట రాంబాబు వంటి యువకులూ, రాజమండ్రి నుంచి వచ్చిన రవికాంత్, డా. చైతన్య శేఖర్, తోరాటి వసంతరావు, అమలాపురం రవి, రాజేష్. ముత్యాల శ్రీనివాసరావు వంటి మిత్రులూ ఇలా ఎంతోమందికి పేర్లు ప్రస్తావించని మిత్రులం దరికీ ధన్యవాదాలు చెప్పి వేరు చేయలేను కానీ పేరు పేరునా నా హృదయ పూర్వక ప్రేమలు!

ఇక్కడ కట్టా కృష్ణారావు కృషిని ప్రస్తావించి తీరాలి. ఆయనో సాధారణ రిటైర్డ్ లెక్చరర్. ప్రగతిశీల భావాల పై అభి మానంతో, ప్రజా ఉద్యమాల పట్ల ప్రేమతో ఈ కార్యక్రమం మొత్తం ఆయనే ఒంటి చేత్తో తలకెత్తుకున్నా రనడం అతిశయోక్తి కాదు. ఆరు పదులు దాటిన వయసులో సైతం ఏక వ్యక్తి సైన్యంగా దీని కోసం పని చేసాడాయన. కొత్తగా పెళ్ళయిన వాళ్ళమ్మాయి దంపతులు ఆమె మొదటి పుట్టినరోజుని సరదాగా కుటుంబంతో జరుపు కోవాలనే తలంపుని కూడా సమాలోచన కోసం కాదనుకుని మొత్తం కార్యక్రమాన్ని వెన్నంటి చేసిన మిత్రులు కృష్ణారావు గారి కార్యాచరణకి నమస్సులు!

మా ఆశయాలు ఆకాంక్షలు ఎన్నయినా ఉండొచ్చు, కానీ అభిప్రాయాలతో పాలు పంచు కోవడానికి ముందుకు వచ్చిన సుమారు 120 మంది ప్రజా సాంస్కృతిక ప్రేమికులకి జోహార్లు. కార్యక్రమ కరపత్రాలు బాగున్నాయని అడిగి మరీ తీసుకోవడం మొదలు అందు లోని మేటర్ ని కాపీ కూడా చేసి డైరీలో రాసుకున్నా నని ఆరోగ్య కారణాల వల్ల సభకు రాలేక పోతున్నానని ఫోన్ లో ప్రేమగా చెప్పిన పాలకొల్లు పెద్దాయన నుండి ఐపోయిన సమావేశానికి సంబంధించిన కరపత్రాలను కూడా అపురూపంగా దాచు కుని తీసికెళ్ళిన ఉ ద్యమ మిత్రుల అభిమానానికి సలామ్ లు. కోవిడ్ నిబం ధనలు పాటిస్తూ జరిగిన ఈ కార్యక్రమం ఎంత మంది ని ఉత్తేజ పరిచిందంటే, దాదాపు పాల్గొన్న ప్రతి ఒక్కరూ మళ్ళీ ఎప్పుడు తదుపరి కార్యక్రమం అంటూ అడిగారు. కాబట్టి, విజయమంటే బలవంతంగా వినేవాళ్ళ సంఖ్యను పెంచు కోవడం కాదు, ప్రజా సంస్కృతి ని బలోపేతం చేసుకోవడమనే భావనని అంతిమంగా కలిగించిన సమాలోచన నా వరకూ నాకో గొప్ప స్ఫూర్తి!

నెల రోజుల ముందు నుండి చేసుకున్న ప్లాన్. ప్రణాళికా బద్ధంగా రూపొందించుకున్న కార్య క్రమం. అయినప్పటికీ ఎన్నో రకాల అడ్డు గోడలు. అనుకోకుండా వేదిక మార్చాల్సి వచ్చింది. భౌగోళిక వాతావరణం కూడా తుఫాను ప్రకటనలతో భయపెట్టింది. పర్సనల్ గా వెళ్ళి ఆహ్వానిం చిన వాళ్ళు దాదాపు పదుల సంఖ్యలో రాలేదు. థర్డ్ వేవ్ నుండి సభని తేలిగ్గా తీసుకోవడం వరకూ అనేక కారణాలు. అనారోగ్యాలు , అనివార్య కారణాలు ఎలాగో ఉన్నాయి. ఐనా, మేం నిరుత్సాహ పడట్లేదు. కొన్ని వంచనలకి ఇసుమంతైనా వెరవట్లేదు. మనిషి మా పక్షం, మేం మనిషి పక్షం. కొద్ది మంది మిత్రులకి ఎన్నో అజెండాలు. మా వెనక ఎవరు న్నారని వెతుకులాడే ప్రయత్నాలు. దానికొక్కటే జవాబు, మా వెనక ఉన్నది మా వెన్నెముకలు మాత్రమే. కాకపోతే అవి కల్తీలేని నిఖార్సయిన వెన్నెముకలు, నిజాలకి మాత్రమే తలొంచేవి, ప్రజల్ని మాత్రమే ప్రేమించేవి!

**(ఇది తక్షణ స్పందనే కానీ పూర్తి రిపోర్టు కాదు. కొద్ది మంది మిత్రులు ఇంకా రాసేదుంది. హడావుడి లో ఫొటోలు, వీడియో లు సరిగ్గా ఏర్పాటు చేయక పోవడం మా పొరపాటు. ఏదో సంక్షిప్తంగా నిన్న జరిగిన సమాలోచన గురించి ఈ సంక్షిప్త రైటప్.)**

# సమానత్వమే సైన్సు ఉద్యమ లక్ష్యం !

## సమతా ఫిలిం ఫెస్టివల్





జన విజ్ఞాన వేదిక ఏర్పడిన 35 సంవత్సరాలలో మొట్టమొదటి సారిగా మహిళా విభాగం మహాసభలు ఇంత పెద్ద ఎత్తున జరగడం ఒకెత్తయితే, ప్రత్యామ్నాయ సినిమాల శక్తిని గుర్తించి రెండ్రోజుల మహిళా సభల్లో ఒక రోజు పూర్తిగా ఫిలిం ఫెస్టివల్ కోసమే కేటాయిం చడం మరొకెత్తు. ఏభై శాతం మహిళా రిజర్వేషన్ల గురించి ఊరికే వగర్చడం కాకుండా ముందు విజ్ఞాన వేదికలో 50 శాతం స్థానాలను స్త్రీలకు కేటాయిస్తు న్నామని సభాముఖంగా తీర్మానం చేయడం ఒక గొప్ప పరిణామం. మహిళా సాధికారతను గుర్తించి కనీసం ఇంత కాలానికైనా అర్థ వంతంగా స్పందించిన జె.వి.వి. కి అభినందనలు !

35 ఏళ్ళ విజ్ఞాన వేదిక ప్రస్థానంలో మహిళల పాత్ర చిన్నది కాదు. అక్షరాస్యత ఉద్యమం మొదలు మద్యపాన వ్యతిరేక ఉద్యమం, ఆరోగ్య స్పృహ , పొదుపు ఉద్యమం, మూఢ నమ్మకాల వ్యతిరేక ఉద్యమం ఇలా ఎన్నెన్నో మైలురాళ్ళను చేరుకున్న జె. వి. వి. కి మహిళా విభాగం గొప్ప బలం. ఆ ప్రస్థానాన్ని ప్రస్తావిస్తూ కేవలం రెండు నెలల హోంవర్క్ తో అవిరామంగా పనిచేసి పాతకొత్త తరాల్ని ఒక్కచోట కూర్చో బెట్టాలనే తపనతో జె.వి.వి. మహిళా విభాగం కన్వీనర్ సోదరి సుజాత సీనియర్ సైన్సు ఉద్యమ నాయకులు డా. బ్రహ్మారెడ్డి, ఇతరేతర మిత్రులు, పెద్దల ప్రోత్సాహంతో, కర్నూలులో చేసిన ఈ అపూర్వమైన ప్రయత్నం భవితకి ఒక విలువైన సమతా సందేశం !

రెండో రోజు మొత్తం ఫిలిం ఫెస్టివల్ ఏర్పాటు చేసి అనేక ప్రాంతాలు, భిన్న సంస్కృతుల నుండి వచ్చిన మహిళలతో సినిమా ప్రదర్శనలో ప్రయోగాత్మకతకి తెరలేపిన సాహసం ఒక సంతృప్తిని ఇచ్చింది. దాదాపు నూట యాభై మంది మహిళలు, ఎక్కువ మందికి ప్రత్యామ్నాయ సినిమాని పరిచయం చేయడం సాధ్యమా ? అన్న అనుమానాన్ని పటాపంచలు చేస్తూ పదుల సంఖ్యలో కొత్త గొంతులతో అద్భుతంగా స్పందించారు. ప్రతి సినిమా పైనా పోటీపడి మరీ అమూల్యమైన అభిప్రాయాలు వినిపించీ, అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తారు!

అది కాదు అసలు విషయం, ఒక పక్క వాతావరణం బాలేదని రాష్ట్ర వ్యాప్తంగా జరగవలసిన భారీ సమావేశాలే వాయిదా వేసుకున్నా "సమత" మాత్రం పట్టు వదల్లేదు. పైగా తల్లులందరికీ పిల్లలతో సహా రమ్మన మని ఆహ్వానించి పిల్లల కోసం ప్రత్యేకంగా గంటగంటకూ అలరించే ఆటపాటలతో ఒక విభాగాన్ని కేర్ టేకర్లను కేటాయించి మరీ ఏర్పాటు చేసి చిన్న పిల్లల తల్లులకు మీరు నిక్షింతగా సదస్సులో పాల్గోండనే పెద్ద భరోసాను ఇచ్చింది. సమావేసాల్లో ఇదో అనూహ్యమైన కొత్త మలుపు. ఉద్యమాల్లో మహిళలు తగ్గిపోతున్నారంటూ, సదస్సులకీ, కార్యక్రమాలకీ స్త్రీలు రావడం లేదంటూ బాధపడే మనకి మహిళలకి, ముఖ్యంగా చిన్న పిల్లల తల్లులకి ఉండే ప్రాక్టికల్ ఇబ్బందులను గుర్తించి వాటికో పరిష్కారం చూపడం ద్వారా సమావేశం సజావుగా సాగేలా చూసుకోవచ్చని నిరూపించడం ఈ ప్రయోగం సాధించిన విజయం !

నిజానికి సినిమాల ప్రదర్శనకు ఎన్నుకున్న స్థలం సరైనది కాదు. వెలుతురు తెరపై పడి ఇబ్బంది పెట్టింది. వెనకున్న కొద్దిమందికి తెర సరిగా కనబడలేదు. సౌండ్ సిస్టమ్ , ప్రొజెక్టర్ అనుకున్నంత బాగా లేవు. గాలి దుమారానికి ఒక సారి ఏకంగా స్క్రీన్ కూడా ఎగిరి పోయింది. ప్రత్యామ్నాయ సినిమాల గురించిన పూర్తి సంవాదాలకీ, ప్రశ్నోత్తరాలకీ అందరికీ సమయం ఇవ్వ లేకపోయాం. ఒక దశలో ఒకట్రెండు కటువైన మాటలు కూడా ఉపయోగించి ఎక్కువ మంది భావాలను పంచుకునే అవకాశం కూడా కోల్పోయాం. నిజానికి అంత సంఖ్యలో వీక్షకులు వచ్చినప్పుడు అందరి భావాలకూ అవకాశం కల్పించడం నిర్వాహకులకు సాధ్యమయ్యేది కాదు. తక్కువ సమయంలో మంచి సినిమాలను వినూత్నమైన రీతిలో ఎక్కువ మందికి పరిచయం చేయాలనే తపన వల్ల జరిగిన ఇలాంటి పొరపాట్లకు నొచ్చుకున్న మిత్రులు పెద్ద మనసుతో అర్థం చేసుకుంటారని మనవి!

మరొక్క విషయం ప్రస్తావించాలి. సావిత్రిబాయి పూలే స్ఫూర్తితో ఈ మధ్య జరిగిన ఒకట్రెండు కార్యక్రమాలని గమనించాను కాన మిత్రులకు ఒక విజ్ఞప్తి. మర్క్స ఏంగెల్స్, అష్ఫాఖ్ బిస్మిల్ లలాగా సావిత్రిబాయి, ఫాతిమా షేక్ లిద్దరూ అవిభాజ్యాలు. మత సామరస్యం కోసం కూడా వాళ్ళిద్దరినీ కలిపి మాత్రమే మనం చూపాలి, ప్రస్తావించాలి. అనేక మంది ముస్లిం మిత్రులు, మహిళలు వచ్చిన ఈ సమావేశంలో ఉన్న మాతా సావిత్రీబాయి ఫోటో పక్కనే ఫాతిమా షేక్ కూడా ఉండుంటే మరింత బావుండే దని నా నిశ్చిత అభిప్రాయం .అయినా, ఎన్ని అవంత రాలు ఉన్నప్పటికీ ఇంత అద్భుతమైన కార్యక్రమా న్ని విజయవంతంగా కొన సాగించిన నిర్వాహ కులకీ, చివరి వరకూ కదలకుండా కూర్చుని సినిమాలు చూసి, కొత్త చైతన్యానికి ఆశలు రేపిన మహిళలు అందరికీ పేరు పేరునా హృదయపూర్వక ధన్యవాదాలు !

(జన విజ్ఞాన వేదిక మహిళా విభాగం "సమత" ఆహ్వానం మేరకు కర్నూలు లో రెండు రోజులు జరిగిన సమావేశాల లో పాల్గొని ఫిలిం ఫెస్టివల్ నిర్వహించడం జరిగింది.



నాకు తెలిసీ తెలుగు రాష్ట్రాలలో జరిగిన మొట్ట మొదటి మహిళా సాధికార ప్రత్యామ్నాయ ఫిల్మ్ ఫెస్టివల్ ఇదే. ఇది ప్రయాణం లో రాసిన తక్షణ స్పందనే తప్పా పూర్తి రిపోర్టు కాదు. ఐనా, ఔత్సాహిక మిత్రుల కోసం ఈ చిన్న రైటప్.)

# కులనిర్మూలన - తులనాత్మక పరిశీలన

## సమాలోచన కార్యక్రమం సంక్షిప్త వివరణ






మే 15, ఆదివారం డా. బి. ఆర్. అంబేద్కర్ కోనసీమ జిల్లా , రావులపాలెం ఏకలవ్య శిక్షణ కేంద్రంలో బాబాసాహెబ్ అంబేద్కర్ విశిష్ట రచన "కులనిర్మూలన' 86 వత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా జరిగిన సమాలోచన ఒక ప్రయోగం !

అవడానికి కొద్దిమందే కావచ్చు కానీ భిన్న అభిప్రాయాలు గల వ్యక్తులు, విభిన్న సంస్థలకి ప్రాతినిధ్యం వహిస్తున్న పెద్దలు అంతా ఒక్కచోటికి చేరి కులనిర్మూలన సాధ్యా సాధ్యాలు, సాధకబాధకాల గురించి కూలంకషంగా చర్చించుకోవడం మంచి ప్రయత్నమని నా అభిప్రాయం !

డా. చెలికాని స్టాలిన్ (చెలికాని రామారావు స్మారక సమితి), డా. చల్లా రవికుమార్ (సంగమం), డా. మోహన ప్రసన్న (విజ్ఞాన వేదిక) , డా. చిలుకోటి కూర్మయ్య (బహుజన మేధావి, రచయిత), మలసాని శ్రీనివాస్ (కులనిర్మూలన వాది), కట్టా కృష్ణారావు (జాహ్నవి సాంస్కృతిక వేదిక), ఆకుమర్తి రవి (మానవహక్కుల వేదిక), ముత్యాల శ్రీనివాసరావు (పెరియార్ ఆలోచనా వేదిక)ఇంకా, కె.వి.వి. సత్యనారాయణ (జనవిజ్ఞాన వేదిక), మాకా రాజేంద్రన్ (మార్పు స్వచ్ఛంద సంస్థ), కరుణాకర్ (అంబేద్కరిస్ట్), పి. యస్. రవికాంత్ (సహవాసి స్వాభిమాన వేదిక), నక్కా దేవిడ్ రాజు (ఉపాధ్యాయ నాయకులు), పెద్దింశెట్టి లెనిన్బాబు (ప్రత్యామ్నాయ పాత్రికేయ వేదిక), రవి (అఖిలభారత విద్యార్థి సంఘం), పోతుల శేఖర్నాథ్ (భూపతి నారాయణ మూర్తి స్మారక వేదిక), వీరే కాకుండా, నల్లా సూర్య ప్రకాష్ ( ఆంధ్రప్రదేశ్ దళిత్ వాచ్), బి. శరత్ బాబు ( అంబేద్కరిస్ట్), ఏసురాజు (సామాజిక కార్యకర్త), మొదలైన వారు వివిధ ప్రాంతాల నుండి వచ్చి ఈ సమా లోచన లో ఆసక్తి గా

పాల్గోవడం  నిజంగా ఒక నిర్మాణాత్మక వేదికకి ఆలంబన !కులనిర్మూలన కి సంబంధించి సీరియస్ చర్చలు సాగిన ఈ సమాలోచన లో విధానపరమైన కార్యాచరణ కోసం భిన్న భావాలు వ్యక్తం అయ్యాయ్. ఐతే, కులనిర్మూలన కోసం ఎవరి పరిధిలో వాళ్ళు ముందుకు వచ్చి ఈ విధమైన సమాలోచన కార్యక్రమాల్ని ఏర్పాటు చేయడం ప్రధానమనే భావన అంతా వ్యక్తం చేశారు!డా. బి. ఆర్. అంబేద్కర్ మహత్తర రచన కులనిర్మూలన లోని అనేక అంశాలతో పాటు మార్క్సిజం, కమ్యూనిస్టు పార్టీల ధోరణులు, భారతీయ సంస్కృతి లోని సంక్లిష్టమైన అంశాలు, యువత పరాధీనత, సాంఘిక పరాయీకరణ మొదలైనవన్నీ చర్చల్లోనికి వచ్చాయ్ !

నన్ను ఆశ్చర్యపరిచింది పాల్గొన్న వారి నిబద్ధత. ఉదయం నుండి సాయంత్రం వరకూ ఒక్కరు కూడా మధ్యలో వెళ్ళిపోకుండా చర్చల్లో పాల్గోవడం. ఎంతమంది తో మొదలు పెట్టామోఅంతే మంది తో సమాలోచన కార్యక్రమం ముగియడం !

రాజ్యాంగ ప్రవేశిక సమిష్టి పఠనంతో ప్రత్యామ్నాయ దృక్పథంతో జరిగిన ఈ కార్యక్రమం,భిన్న భావాలు గల వ్యక్తులు ప్రజాస్వామిక పద్ధతిలో కులనిర్మూలన అనే అంశానికి సంబంధించీ జరిపిన విశ్లేషణాత్మక చర్చలు వ్యక్తిగతంగా నన్ను అబ్బుర పరిచాయ్. డా. బి. ఆర్. అంబేద్కర్ కులనిర్మూలన పుస్తకం 86 ఏళ్ళు పూర్తి చేసుకున్న సందర్భంగా ఇరు తెలుగు రాష్ట్రాలలో జరిగిన ఏకైక చర్చా కార్యక్రమం ఇదేనని కచ్చితంగా చెప్పగలను ! ఈ కార్యక్రమం మరింత స్పష్టతని సంతరిం చుకుని , ఇంకా బలోపేతం కావాలని కులనిర్మూలనే ధ్యేయంగా విభిన్న రకమైన ప్రజాతంత్ర ఉద్యమ రూపాలలో ముందుకి సాగాలనీ, అందుకోసం ముందుకొచ్చి వారివారి విలువైన వనరుల్ని, సమయాన్ని వెచ్చించిన అందరకీ పేరుపేరునా హృదయపూర్వక ధన్యవాదాలు !

**(భవిష్యత్ కార్యాచరణ గురించి పూర్తిగా ఇంకా చర్చించాల్సి ఉంది కానీ ప్రస్తుతం ఈ సమా లోచన వంటిదే దగ్గర జిల్లాల్లోని ఇతరేతర ప్రాంతాలలో జరపాలని మిత్రులు ఉత్సాహంగా ఉన్నారు. అలాగే ఇతర కార్యాచరణ ప్రణాళిక కి సంబంధించి సమాచారాన్ని సామాజిక మాధ్యమాల ద్వారా అందరికీ తెలియజేయడం జరుగుతుంది.)**







# మరిచిపోలేని మహా స్పందన

## మహాపండిత్ రాహుల్జీ సమాలోచన

(ఏప్రిల్ 9 న జరిగిన సమావేశం విశేషాలు)










అక్షరాలకి సరిహద్దులుండవు. అభిమానానికి కొలమానాలుండవు. ఆశ్చర్యానికి అవధులుండవు. అనుభూతులకి వ్యాఖ్యానాలుండవు. మహా పండితుత్ రాహుల్ సాంకృత్యాయన్ జీవితం – కృషి గురించి మొన్న శనివారం కాకినాడ లో జరిగిన సభకి సంబంధించిన రిపోర్టు ఇంకా రాయలేదేమని మిత్రులు అడిగారు. ఆ ప్రజా సమూహాల అకళం కిత ప్రేమ నుండి తేరుకుని మళ్ళీ మామూలుగా మారడానికి కాస్త సమయం పడుతుందని చెప్పాను. అలాంటి నిర్మాణాత్మక సమావేశాన్ని నేనైతే ఈ మధ్య కాలంలో కచ్చితంగా చూడలేదు. అంతటి జన సంద్రం ఎక్కడా కనబడలేదు. స్వచ్ఛందంగా స్పందించిన అశేష ప్రజల హుందాతనపు కదలికల్ని కళ్ళలో ఎప్పటికీ దాచుకోగలిగితే బాగుంటుందని అనిపించిన అద్భుతమైన సమావేశం. విశ్వనరుడై ఉండి విస్మరణకు లోనైన రాహుల్జీకి విశేషంగా తెలుగు సమాజం సగర్వంగా సమర్పించిన గౌరవం ఈ సమాలోచన కార్యక్రమం!

వందా నూటేబై మందొస్తే ఏదో విజయవంతం అయిందనిపిద్దామనే ఆలోచనతో ఉన్న నేను దాదాపు రెండొందల డెబ్భై మంది పై చిలుకుగా వచ్చిన జనసంద్రాన్ని చూసి అవాక్కైపోయాను. నాలాగే నిశ్చేష్టులైన నిర్వాహకులు తేరుకునే లోపే నేనా ప్రజా ప్రేమ కి పూర్తిగా ఫిదా అయిపోయాను. సరిపోని భోజనాలు, మంచి నీటి క్యానులకి కూడా మూడ్నాలుగు సార్లు బయటకి తిరగవలసి రావడం, సుమారు ఐదారు బుక్ స్టాళ్ళు విశాలాంధ్ర, ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం, బహుజన బుక్ స్టాల్, బౌద్ధ సాహిత్యం, ప్రగతిశీల సమాఖ్య, ఇవి కాక వీక్షణం , హేతువాది సాహిత్యం, అంబేద్కర్, ఫూలే, పెరియార్ ల ఫొటోలు పెట్టినప్పటికీ అమ్ముడుపోయిన రాహుల్జీ సాహిత్యం కోసం ఇంకా అనేకమంది అడుగుతూండటం ఆశ్చర్యం కలిగించింది. అది కాదు అసలు

విషయం. ఒక పక్క ఒంటి పూట స్కూళ్ళు కనుక టీచర్లు, జిల్లాల పునర్విభజన కనుక ఉద్యోగులు, పరీక్షల సీజనని విద్యార్థులు అనుకున్న సంఖ్యలో రాలేకపోయారు. మరోపక్క అదే రోజున కోనసీమ జిల్లా మొత్తం బంద్ ప్రకటించారు. కొద్ది మంది ఇతరేతర ప్రాంతాల సమావేశాలకని ముందే నిర్ణయించుకుని వెళ్ళిపోయారు. ముందు రోజు వరకూ వస్తామని ఉదయాన్నే అనివార్య కారణాల వల్ల రాలేకపోతు న్నామని పక్క ఊరివాళ్ళే ఫోన్ చేసిన వారు దాదాపు పదిమంది కి పైగా ఉన్నారు. ఇన్ని ఉన్నా సరే స్వచ్ఛందంగా అంతమంది జనం ఎక్కడ నుండి తరలి వచ్చారోనని వచ్చిన వారంతా విభ్రాంతి చెందారు !

నెల రోజుల ముందు నుండి అనుకుంటున్న సమావేశం. ప్రకటించాక ఇంట్లో జరిగిన విషాదం. రకరకాల ఒత్తిళ్ళు. వాయిదా వేయలేని ప్రయాణాలు. ఆర్థికంగా, హార్దికంగా, సామాజికంగా ఉన్న పరిమితులు. ఇన్ని అవాంతరాల మధ్య నన్ను సంభ్రమా శ్చర్యాల్లో ముంచెత్తిన ప్రజాభిమాన ప్రవాహం ఈ సమావేశం. మన గొప్ప కాదు, రాహుల్జీ వ్యక్తిత్వంలోని గొప్పతనం అది. మన శ్రమ కాదు, మనదనుకుని రాత్రీ పగలూ సభ కోసం కష్టపడి పని చేసిన అనేకమంది మిత్రుల అవిశ్రాంత కృషి ఇది. వచ్చినవారూ, వారు రాలేకపోయినా సామాజిక మాధ్యమాలలో కార్యక్రమం గురించి విస్తారంగా ప్రచారం చేసి ఇతోధికంగా సహకరించిన వారు ఎందరో శ్రేయోభి లాషులు. అందరకీ శిరస్సు వంచి నమ్రతగా అభివాదాలు చేస్తున్నాను !

తెలంగాణ మహబూబ్ నగర్ నుండి వచ్చిన మిత్రులు వేణుగోపాల్ వర్మ, వెంకట్ రెడ్డి గార్లు, హైదరాబాదు నుండి వచ్చిన వై. జానకిరాం గారు, శ్రీకాకుళం నుండి వచ్చిన బెందాళం కృష్ణారావు గారు, భద్రాచలం నుంచి శీను, ఖమ్మం నుండి వచ్చిన రాధాకృష్ణ మూర్తి గారు, గుంటూరు నుండి వచ్చిన హరికృష్ణ, విజయ వాడ నుండి సత్యనారాయణ, ఏలూరు నుండి వచ్చిన రామకృష్ణ, విశాఖపట్నం నుండి వచ్చిన త్రిమూర్తులు గారు, రాధారాణి గారు, వర్మ గారు, ఈ సభ కోసం బెంగుళూరు నుండి నెల్లూరు మీదుగా ఎంతో శ్రమకోర్చి ఆత్మీయంగా వచ్చిన పెద్దలు మురళీధర్ గారు ..ఇంకా వారు హాజరు కాకున్నా సోషల్ మీడియా లో అందర్నీ ఏక్టివ్ చేసిన బాలాజి (కోల్కతా), జయప్రకాష్ (సిమ్లా) శాంతారావు (పెదన), రవికాంత్ (కోరుకొండ), రాజేంద్రన్ (రావులపాలెం) ఇలా చెప్పుకుంటూ పోతే ఎందరో. అందరకీ ఉద్యమాభినందనలు !

ఇక జిల్లా లో కార్యక్రమం కోసం పాటుపడ్డ కట్టా కృష్ణారావు గారు, స్టాలిన్ గారు, సాంకేతిక విషయాల్లో సోషల్ మీడియా మొత్తాన్ని సభ కోసం అప్రమత్తం చేసిన పెద్దింశెట్టి రామకృష్ణ, కార్యక్రమం మొత్తాన్ని డాక్యుమెంట్ చేసే బాధ్యత తీసుకున్న మిత్రుడు లెనిన్ బాబు , ఏర్పాట్లన్ని దగ్గరుండి పర్యవేక్షించిన సాహితీ స్రవంతి మిత్రులు మార్ని జానకిరాం

గారు, విజ్ఞాన వేదిక మిత్రులు, డా. చల్లా రవికుమార్ (మండపేట), డా. జి. సి. పట్టాభిరామయ్య (దుళ్ళ), కొండ (జగన్నా ధగిరి) సిద్ధూ (వెదురుపాక) నానిబాబు (గొల్లప్రోలు) వి. యస్ (పిఠాపురం), సత్య నారాయణ (అన్నవరం) రామచంద్రాపురం నుండి ఈశ్వర్, రఘురాం, రాము, ప్రేమానందం తదితరులు రాజమండ్రి నుండి డా. చైతన్య శేఖర్, తాతారావు, పసల భీమన్న దంపతులు, ప్రజాపత్రిక సుదర్శన్, దాడి గంగాధరరావు, ప్రసాద్, లక్ష్మణరావు ప్రభృతులు , ఇక పెద్దాపురం మిత్రులు శివ ఇతరులు, కళా బృందం, కాకినాడ లోని అంబేద్కర్ సంఘ సభ్యులు, జె.వి గారు, గ. నా. రా. గారు, మేకా సుబ్బారావు గారు, సామర్లకోట నుండి రామకృష్ణ గారు, దివిలి నుండి చందర్రావు మాష్టారు చేబ్రోలు, తుని, జగ్గంపేట, ఉప్పాద నుండి నా మీద ప్రేమతో వచ్చిన మిత్రులు, కళాభిమానులు, సాహిత్య కారులు, సామాజికవేత్తలు, సాంస్కృతిక రంగ కార్యకర్తలు, ప్రత్యామ్నాయ ఉద్యమకారులు, కవులు, రచయితలు, నాటక పరిషత్తు బాధ్యులు అందరకీ పేరుపేరునా సలామ్ లు !

సభాధ్యక్షులు డా. భారతలక్ష్మి గారు, డా. జ్యోస్యుల కృష్ణబాబు గారు, అద్దేపల్లి ప్రభు గారు, కె.ఎమ్మార్ ప్రసాద్, డా. కాళ్ళకూరి శైలజ గారు..వక్తలు తెలుగు వారి కి రాహుల్జీ కృషిని అందించడం కోసం జీవితాంతం తపించిన రాహుల్జీ సాహిత్య సదన్ వ్యవస్థాపకులు ఆలూరి భుజంగరావు గారి కుమార్తె ఆలూరి కవిని గారు, శతాధిక గ్రంథకర్త, బౌద్ధ తాత్వికులు బొర్రా గోవర్ధన్ గారు, వీక్షణం సంపాదకులు ఎన్. వేణుగోపాల్ గారు, సాంస్కృతిక కార్యకర్త దేవి గారు ఎవరికి వారే ధీటైన ప్రసంగాలతో మళ్ళీ శ్రోతలందర్నీ రాహుల్జీ తో ప్రేమలో పడేసారు. వచ్చినవారు నెళ్ళాళ్ళ ముందు తెచ్చిన కరపత్రాన్ని కూడా ఎంత అపురూపంగా దాచుకున్నారంటే, వారి దగ్గరున్నవి అయిపోతే వాట్ని జిరాక్స్ ప్రతులు తీసి మరీ పంచారని తెలిసి విస్మయం చెందాను. అడిగితే నా దగ్గర ఉన్నవి పంపుదును కదండీ అంటే “అవి మరెవరైనా ఉపయోగపడుతాయి. సమా వేశానికి వస్తారో రారో తర్వాత సంగతి. అసలు కరపత్రం చదివితే చాలనే ఉద్దేశంతోనే అలా పంచామండీ.” అన్నారు. ఏం మాట్లాడ గలను ఆ అనురాగానికి, ఆత్మీయంగా గుండెల్లో పెట్టుకోవడం తప్పా!

రాహుల్జీ వంటి నిబద్ధత గల త్యాగశీలుల జీవితానికి కులమత లింగ ప్రాంత వర్గాలకు అతీతంగా తెలుగు నేల చాలా సంవత్సరాల తరువాత ప్రకటించిన అద్భుతమైన నివాళి ఈ సమావేశమనేది నా అభిప్రాయం. అదే వేదిక పై బాబాసాహెబ్ అంబేద్కర్, మహాత్మా జోతిబా ఫూలే, ఉస్మానియా లో ముష్కరుల చేతిలో హత్యకు గురైన హైద్రాబాద్ చేగువేరా జార్జిరెడ్డి 50 వ వర్ధంతి సందర్భంగా నివాళులు అర్పిస్తూ జైళ్ళలో అక్రమంగా మగ్గిపోతున్న

రచయితలు సాయిబాబా, వరవరరావు ఇతర దళిత బహుజన ఆదివాసీ లని విడుదల చేయాలని , అక్షరాలెప్పుడూ ప్రజాపక్షమే వహించాలనీ, వహిస్తామనీ రాహుల్జీ సాంస్కృతిక సమాఖ్య స్పష్టంగా ప్రకటించింది. వచ్చిన వారందరికీ రాహుల్జీ గురించిన పాతిక వ్యాసాలతో ప్రచురించిన విశిష్ట వ్యాస సంకలన గ్రంథం, 'ఒకే వ్యక్తి – అనేక జీవితాలు: రాహుల్ సాంకృత్యా యన్" అందజేయడం జరిగింది. పుస్తకానికి అందమైన ముఖచిత్రం వేసి పంపిన కవితకి, వ్యాసకర్తలు, అనువాద కులకి, అలాగే టైప్ చేసిన వి.యస్. గ్రాఫిక్స్ కి, చాలా తక్కువ సమయంలో అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీశ్రీ ప్రింటర్స్ కి కూడా ధన్యవాదాలు. తెలుగు లో నాకు తెలిసీ రాహుల్జీ జీవితం పై విభిన్నమైన రీతిలో వచ్చిన మొదటి అరుదైన వ్యాస సంకలనం ఇది !

చివరగా,అనూహ్య ప్రజానీకం వచ్చినందువల్ల చేసిన ఏర్పాట్లలో లోటుపాట్లు ఉంటే దయచేసి క్షమించమని మనవి. అలాగే సమయాభావం వల్ల అనేకమంది మిత్రుల్ని ప్రస్తావించలేదు. ఎవరినైనా అలా మర్చిపోతే అది ఉద్దేశ పూర్వకంగా కాదని దయచేసి మన్నించమని కోరుకుంటున్నాను. అలాగే ఎంతోమంది కి మాట్లాడే అవకాశం లేకపోయింది. ముందుగా అనుకున్న షెడ్యూల్ ప్రకారం చేయడానికి ఎంతగా ప్రయత్నించినా సాధ్యం కాకపోయింది. ప్రకటించిన చర్చలకి అసలు సమయమే చాలలేదు. నన్నూ, ఇతర నిర్వాహకుల్నీ ఆశ్చర్యానికి గురిచేస్తూ దేశంలో సంక్షోభ పరిస్థితులు నెలకొన్న ఈ కాలంలో ఎంతో దూరాల్నుంచి భారమనుకోకుండా అనూహ్యమైన స్థాయిలో ఇంతమంది స్వచ్ఛందంగా వచ్చి పూర్తిగా సమావేశంలో పాల్గొన్నారు. కొద్దిమంది వారి విలువైన భావాలు సైతం పంచుకున్నారు. రెండ్రోజుల నుండి అలసట వల్ల స్పందించడం అవలేదు. కానీ ప్రస్తుతం వ్యవస్థ లో నెలకొన్న పరిస్థితుల రీత్యా ఈ సమావేశం ఎంత ముఖ్యమో మాకు తెలుసు. ఇప్పట్లో మళ్ళీ ఇంతటి కార్యక్రమం కుదరకపోవచ్చు. కానీ ఇంత సంతోషానికి కారణమైన వారందరికీ పేరుపేరునా హృదయ పూర్వక ప్రేమలు, అలాగే కార్యక్రమం మొదట్నుంచి చివరిదాకా సహకరించిన టెక్నీషియన్స్ మొదలుకుని , సోదర పారిశుధ్య కార్మికుల వరకూ తెర వెనుక ఉండిపోయిన పేరు తెలియని కార్యకర్తలందరకీ కూడా జోహార్లు తెలుపుతూ ఇక ఇక్కడికిలా ఆపుతున్నాను, సెలవు!

(ఇది తక్షణ స్పందనే కానీ కార్యక్రమం పూర్తి రిపోర్టు కాదు. FB లో ఈసరికే కొద్దిమంది మిత్రులు వారి అనుభూతుల్ని, ఫొటోల్ని షేర్ చేసినందుకు ధన్యవాదాలు. త్వరలోనే పూర్తి

రిపోర్టు, డాక్యుమెంటెషన్ ,కార్యక్రమం పూర్తి వీడియో మిత్రుల సహకారంతో పూర్తి చేసి బయటకి తెస్తామని మనవి. ఇక రాహుల్జీ గురించిన వ్యాస సంకలనం సాఫ్ట్ కాపీ లేదు. హార్డ్ కాపీ కావాల్సిన మిత్రులు కాల్ చేస్తే ఎక్కడ దొరుకుతుందో వివరాలు తెలపగలను. ధన్యవాదాలు.)



# మూడు జిల్లాలు - మూడు కార్యక్రమాలు !








కాకినాడ జిల్లా :
అంతర్జాతీయ యువజన దినోత్సవాన్ని పురస్కరించుకుని, పిఠాపురం ఫిల్మ్ సొసైటీ కి అర్ధదశాబ్ద్యుత్సవం సందర్భంగా, పిఠాపురం సాంస్కృతిక సమాఖ్య సారధ్యంలో చారిత్రక శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయంలో ఆగస్టు 12 న చిరు సమావేశం నిర్వహించుకున్నాం. మహాకవి ఆవంత్స సోమసుందర్ నివాళితో ప్రారంభమైన కార్యక్రమంలో వివిధ సంఘాల మిత్రులు పాల్గొన్నారు. ప్రత్యామ్నాయ సినిమాలు, మానవాళి పై మాధ్యమాల ప్రభావం గురించి సమాలోచన జరిగింది !
డా. బి. ఆర్. అంబేద్కర్ కోనసీమ జిల్లా :
స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకునిఏకైక తెలుగు గదర్ వీరుడు దరిశి చెంచయ్య గారి జీవితం, కృషి గురించి రామచంద్రాపురం చెలికాని రామారావు స్మారక సమితి సారధ్యం లో నల్లూరి వెంకటేశ్వర్లు (అన్న) గారి చేతుల మీదుగా" ఆయన జీవితమే ఒక సందేశం" పుస్తక ఆవిష్కరణ కార్యక్రమం ఆగష్టు 13 న నిర్వహించుకున్నాం. 200 మంది పై చిలుకు పాల్గొన్న ఈ సభ, మహా కళాకారుడు గద్దర్ స్మృతిలో కొనసాగి, గదర్ ఉద్యమం, దరిశి చెంచయ్యల స్ఫూర్తిని ఇనుమడింప చేసింది !
తూర్పుగోదావరి జిల్లా :
సంచలన వ్యంగ్య రచయిత, కళాకారుడు డి. ఆర్. ఇంద్ర గారి రచనల గురించిన చిరు చర్చా కార్యక్రమం సాంస్కృతిక రాజధాని రాజమహేంద్రవరం తిలక్ రోడ్ లోని 'వైశాలి', ఇంద్ర స్వగృహంలో కొద్దిమంది ఆత్మీయుల సమక్షంలో, గోదావరి సాహితీ మిత్రులు సారధ్యంలో నిర్వహించుకున్నాం. కొద్దిమంది భావోద్యమకారులు పాల్గొన్న ఈ సమాలోచనఆద్యంతం ఆసక్తికరంగా జరిగింది. తెలుగు సమాజాన్ని తన రచనలతో చాచి లెంపకాయ కొట్టే ఇంద్ర గారికి చిరు అభినందన, అలాగే ఆయనతో ప్రశ్నోత్తరాల ఇష్టాగోష్టి నిర్వహించి, వారి ప్రేమపూర్వక ఆతిథ్యం స్వీకరించాం !
మూడు జిల్లాల్లో జరిగిన ఈ మూడు కార్యక్ర మాలకి బెంగాల్ నుండి బాలాజీ, నిర్మల, కవిత హాజరయ్యారు. అలానే రామచంద్రాపురం పుస్తకావిష్కరణ కార్యక్రమానికి హైద్రాబాద్ నుండి వేణుగోపాల్, వనజ, విభాత, అలానే కె. శాంతారావు, జానకిరాం(జాని), ప. గో.

నుండి డి. సోమసుందర్, ఒంగోలు ప్రాంతం నుంచి అన్నతో కలిసి కొందరు మిత్రులు రావడం జరిగింది. వారందరికీ ధన్యవాదాలు.

ఎంత కాదనుకున్నా మనుషులం కాబట్టి పని తొందర్లొ తప్పులు దొర్లవచ్చు. ముందుగా అనుకున్న ప్రణాళిక ప్రకారం అన్ని పనులూ అవలేదు. ఆలస్యారంభం కారణంగానే అనేకమందికి మాట్లాడడానికి అవకాశం లేకుండా పోయింది. నా అసహనమూ కాస్త బాధపెట్టింది. పుస్తకాలు కూడా అందరికీ అందించలేకపోయాం. అందుకు క్షంతవ్యులం. కానైతే, ఈ క్రమంలో పాతమిత్రులు అందరం మళ్ళీ కలుసుకోవడం, మరోసారి పలకరించు కోవడం, కలిసి గడపడం సంతోషకరమైన సందర్భం. పూర్తి వివరాలతో కూడిన రిపోర్ట్ త్వరలోనే అందించడానికి ప్రయత్నం చేస్తా కానీ పనుల ఒత్తిడి వల్ల ప్రస్తుతం ఈ సంక్షిప్త రూపానికే పరిమితం అవుతూ, ఆయా అపురూపమైన జ్ఞాపకాలతో ఈ చిన్న రైటప్.








# సాహితీ శిఖరానికి సాదర నివాళి !

## (డా. ఆవంత్స సోమసుందర్ శతజయంతి)









నవంబర్ 19, ఆదివారం కాకినాడ జిల్లా పిఠాపురంలోని శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయంలో చెలికాని భావనరావు సభాసదన్ లో జరిగిన వజ్రాయుధ మహాకవి, శతాధిక గ్రంథకర్త, కళారత్న డా. ఆవంత్స సోమసుందర్ గారి శతజయంత్యుత్సవ సదస్సు కన్నుల పండుగగా జరిగింది. సుమారు 120 మందికి పైబడి పాల్గొన్న ఈ సమావేశంలో దాదాపు 50 మంది సో.సు. గారితో గాఢమైన వారి అనుబంధం గూర్చి పంచుకున్నారు !

ఢిల్లీ మొదలుకొని హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు, రాజమహేంద్రవరం, కోరుకొండ, పెద్దాపురం, సామర్లకోట, కాకినాడ ...ఇంకా అనేక ప్రాంతాల నుండి కార్యక్రమం కోసం పనిగట్టుకు వచ్చిన మిత్రులకూ, మొత్తం సదస్సు పూర్తయ్యే వరకూ ఉండి వారి భావాలు పంచుకుని శతజయంత్యుత్సవ ఆతిథ్యం, చిరు సత్కారాలు, స్వీకరించి ఆనందంగా వెళ్ళిన శ్రేయోభిలాషులు అందరకీ పేరుపేరునా ధన్యవాదాలు !

ఎంత గొప్ప కార్యక్రమంలో ఐనా పొరపాట్లు, కొన్ని లోటుపాట్లు సహజం. అలా సభికుల్ని వారి పాటలతో అలరించిన పెద్దాపురం ప్రజా నాట్యమండలి బృందానికీ చిరు సత్కరం జరగకపోవడం, కొద్దిమంది మిత్రులకి మాట్లాడే అవకాశం లభించకపోవడం మా తప్పే. ఉద్దేశ పూర్వకంగా చేయకపోయిన ప్పటికీ సదస్సు సంచాలకుడిగా జరిగిన దానికి పూర్తి బాధ్యత నాదేనని అందుకు క్షంతవ్యుడ్నని మనవి చేస్తూ వారికి ప్రత్యేక అభినందనలు !

శతజయంతి సందర్భంగా ప్రచురించిన పుస్తకం 'ఆకాశమంత అక్షరమూర్తి – డా. ఆవంత్స సోమసుందర్ ( వజ్రాయుధ కవికి వందేళ్ళు)' అనే 40 పుటల చిన్న పొత్తం. కంటి ఆపరేషన్

కోసం ముంబయి నుంచి హైదరాబాద్ వచ్చిన కామ్రేడ్ వరవరరావు గా రు నాలుగుపుటల్లో ఈ పుస్తకానికి ముందుమాట గా ఆత్మీయ సందేశాన్ని 'ఆవంత్స సోమ సుందర్ – ఆనాటి జ్ఞాపకాలు' పేరిట డిక్టేట్ చేసి పంపించడం విశిష్టమైన విషయం !

అపూర్వమైన శతజయంతి కార్యక్రమం గురించిన మధుర జ్ఞాపకాలను పూర్తిగా తీరిక చేసుకుని తర్వాత పంచుకుంటానుగానీ, ఎక్కడెక్కడ నుండో సమావేశం కోసమని శ్రమకోర్చి స్వచ్ఛందంగా వచ్చి పాల్గొన్న సాహితీవేత్తలు, సామాజిక కార్యకర్తలు, సారస్వత పిపాసులకి పేరుపేరునా ప్రత్యేక ధన్యవాదాలు. పుస్తకం కావాల్సిన వారు నా వాట్సప్ నంబర్ 9032094492 కి రిక్వెస్ట్ పెడితే సాఫ్ట్ కాపీ పంపగలను. విమర్శలకు ఆహ్వానం !










# ఒకటే ఆలోచన - అనేక ఆగమనాలు !

## (సమాలోచన సమావేశం సంక్షిప్త వ్యాఖ్య)





'భారతీయ సాంస్కృతిక వికాసంలో బౌద్ధం' ఒక విశిష్ట ప్రయోగం. బౌద్ధం, మార్క్సిజం, అంబేద్కరిజం వంటి ప్రత్యా మ్నాయ సైద్ధాంతిక సామాజిక కార్యాచరణకు ఊతమి చ్చేందుకు, తాత్త్వికత గురించి చర్చించేందుకు సుమారు నలభై నాలుగు మంది విలక్షణ మైన ప్రజాపక్ష ఆలోచనా పరులు స్వచ్ఛందంగా వచ్చి పాల్గొన్న విలక్షణ సమాలోచన సమావేశం !

ఆహ్వాన కరపత్రం చూసి ఆహా ఓహో అన్న వాళ్ళు అంబేద్కర్, మార్క్స్,బౌద్ధం కోసం చొక్కాలు చించుకునే వాళ్ళూ, వస్తామని మాటిచ్చిన వక్తలూ కూడా కాకినాడ, రాజ మండ్రి,విశాఖపట్నం వంటి చోట్లకి వేరే కార్యక్రమాలకి వెళ్ళిపోయార ని తెలిసింది. అది వాళ్ళ సంస్కారం. దానికో నమ స్కారం పెట్టి ఊరుకోవడం తప్పా చేసేదేం లేదు !

ఐనా సరే, దూరభారాలను కూడా లెక్క చేయ కుండా,వ్యయప్రయాసలతో వరంగల్, విజయ వాడ,తణుకు, కోరుకొండ, జగన్నాథగిరి, ఏగారెడ్డిగూడెం, రావులపాలెం, నవుడుజంక్షన్, కడియం,ముమ్మిడివరం, బొమ్మూరు, పిఠాపురం, దుళ్ళ వంటి పది ప్రాంతాలకు పైబడి మా కార్యక్రమం కోసం వచ్చిన ప్రతి ఒక్కరి నిబద్ధతకి నిర్వాహకుల తరపున పేరుపేరునా మా సలామ్ !

బహుజన బౌద్ధ సమాఖ్య సారధ్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో సంఘమిత్ర ఫౌండేషన్, మైత్రేయి బుద్ధ విహార, ప్రశ్న అధ్యయన వేదిక, సహవాసి స్వాభిమాన వేదిక, విపశ్యన కేంద్రం,దళిత్ సోషల్ వాచ్,

మార్పు సంస్థ, రాజమహేంద్రి ఆలోచనా వేదిక, సహృదయ మిత్రమండలి, ప్రగతిశీల పాత్రికేయ వేదిక, పర్యావరణ పరిరక్షణ సమాఖ్య, బుద్దిస్ట్ సొసైటీ ఆఫ్ ఇండియా వంటి సంస్థల నుండి పాల్గోవడం ఆశ్చర్యకరం !





డా. బి. ఆర్. అంబేద్కర్ బౌద్ధ ధర్మ స్వీకార సందర్భాన్ని పురస్కరించుకొని ప్రచురించిన 'అడుగుజాడ' పత్రిక ప్రత్యేక సంచిక, మహా మానవుడు, దార్శనికుడు డా. రామ్ మనోహర్ లోహియా వర్ధంతి సందర్భంగా లోహియా విజ్ఞాన సమితి హైద్రాబాద్ వారు ఇరువురు సోషలిస్టు మహా మహులు మధులి మాయే, మధూ దండావతేల శత జయంతి సందర్భంగా ముద్రించిన "మధుద్వయం" గ్రంథాన్ని ఆవిష్కరించడం జరిగింది !

ఇన్నింటిలోకీ సంతృప్తినిచ్చిన విషయం ఏకవ్యక్తి సైన్యంలా పనిచేసుకు పోతున్న మహోదయ 69వ జన్మ దినోత్సవాన్ని అందరం కలిసి ఆయనకి చిరు అభినందన సత్కారం చేయడం. ఆశ్రమం లో ఉన్న అబ్దుల్ కలాం విగ్రహానికి కూడా జయంతి సందర్భంగా యువత నివాళులు అర్పించడం. ఎటకారాలు, ఏడుపులూ ఎలాగో ఉంటాయ్ కానీ, ఆచరణాత్మకంగా ఒక మహాసంకల్పానికి ప్రతీకగా నిల్చిన మంచి మనిషి కృషిని సమిష్టిగా గుర్తించడమే కదా నిజమైన సంతోషమంటే !

అందులో భాగంగా ఈ మధ్య జరిగిన కార్యక్రమాల్లోకెల్లా నాకు సంతృప్తిని ఇచ్చిన ఈ సమాలోచన సమావేశం గురించిన సంక్షిప్త రిపోర్టు మాత్రమే ఇది. ఇందులో సహకరించిన ప్రతీ వ్యక్తికి పేరుపేరునా అభినందనలు తెలుపుకుంటున్నాను. సమయాభావం వల్ల మాట్లాడే అవకాశం లేకపోయిన మిత్రుల కి నిజాయితీగా క్షమాపణలు తెలుపుతూ కొన్ని అమూల్య మైన ఫొటో జ్ఞాపకాలతో ప్రస్తుతానికి ఇలా ఈ చిన్న రైటప్ !

(వచ్చిన ఆహూతులు విశాల మైన ఆశ్రమ ప్రాంగణమంతా తిరుగుతూ సందడి చేసారు. మహో దయని ఆశ్రమ చరిత్ర గురించి, మహనీయుల విగ్ర హాల స్థాపన నేపథ్యం గురించి ఎన్నో విష యాల్ని ఆసక్తిగా అడిగి తెల్సు కున్నారు. ఆ జ్ఞాపకాల్ని ఫొటో లుగా మల్చుకున్నారు. అను భూతుల్ని ఆత్మీయులకి వీడియో కాల్స్ చేసి మరీ పంచుకున్నారు. మళ్ళీ తప్పని సరిగా మరింతమందిని తీసుకు వస్తామని సంతోషంగా సెలవు తీసికొని వెళ్ళారు. ఆ సంగతులన్నీ మరోసారి !)

# రెండు మహోద్యమాల స్మరణలో...

## అమరుడు భగత్‌సింగ్

## (50 ఏళ్ళనాటి విశిష్ట రచన )







మన్మథనాథ గుప్తా భగత్‌సింగ్ సహచరుడు. ఉత్తర భారతంలో స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రత్యక్షంగా పాలుపంచుకున్న వ్యక్తి. హిందీ, ఆంగ్లాల్లో ఎన్నో రచనలు చేశాడు. ఆయన రచనలు కొన్ని నిషేధించబడ్డాయి. ఆయన చాలా క్లుప్తంగా భగత్‌సింగ్ గురించి 50 ఏళ్ళ క్రితం రాసిన వ్యాసం ఇది !

విస్తృతమైన భగత్‌సింగ్ సాహిత్యం ఈసరికే అందుబాటులో ఉన్న కారణంగా ఇదేమీ గొప్పగా అనిపించకపోవచ్చు. పైగా స్థూల దృష్టికే కానీ ఎన్నడో ప్రభుత్వం ప్రచురించిన ఈ వ్యాసం అంత కొత్తగా నాకు ఏమీ తోచలేదు. ఐనప్పటికీ భగత్‌సింగ్ గురించిన నామమాత్రపు పరిచయం కోసం మాత్రమే ఇదిలా తెలుగు చేసాను !

వ్యక్తిగత పని కోసం వచ్చినప్పటికీ నిన్న అడగ్గానే కార్యక్రమం కోసం ఒప్పుకుని అద్భుతమైన ప్రసంగం చేసిన మిత్రులు, పెద్దలు వేణుగోపాల్‌కి ప్రత్యేక ధన్యవాదాలు చెప్పాలి. ఆయన ఉపన్యాసం దానికదే ఒక వైజ్ఞానిక ప్రవాహం. అలాగే కార్యక్రమం ఏర్పాటు చేసిన చెలికాని రామారావు కమిటీకి ధన్యవాదాలు !

నిన్న వర్కింగ్ డే. విద్యార్థులకి పరీక్షలు. అనుమానిస్తూనే కార్యక్రమం పెట్టాం. ఐనప్పటికీ సుమారు 80 మంది వచ్చారంటే సమాజంలో మంచి ఆలోచనలకి, మార్పు కోసం జరిగే ప్రయత్నాలకి ఇంకా ఆదరణ ఎంతోకొంత మిగిలే వుందనడానికి ప్రతీక అనిపిస్తుంది. అక్కడే పుస్తకావిష్కరణ జరిగింది !

అది కాదు ఆశ్చర్యం. పాలకొల్లు నుండి పెద్దలు గోపాలకృష్ణ గోఖలే గారు మొదలుకొని ఈ మధ్యే కుటుంబంలో జరిగిన విషాదాన్ని కూడా పక్కనపెట్టి వచ్చిన జగన్నాథగిరి పోలిశెట్టి కృష్ణ గారి వరకూ దూరభారాలని భావించక ఎంతోమంది ఆత్మీయంగా, స్వచ్ఛందంగా

వచ్చి పాల్గొన్న తీరుకి సంతోషం కలిగింది !

మహత్తర వైకోమ్ సత్యాగ్రహం, హిందుస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసియేషన్ ఉద్యమాలకి వందేళ్ళు పూర్తవుతున్న సందర్భంగా ఇదిలా తీసుకు వస్తున్నాను. ఆసక్తి ఉన్న మిత్రులు 9032094492 కి వాట్సప్  రిక్వెస్ట్ పెడితే పుస్తకం సాఫ్ట్ కాపీ పంపగలను. చదివాక విమర్శలకు ఆహ్వానం !

**(ఇది తక్షణ స్పందనే కానీ పూర్తి కార్యక్రమం రిపోర్టు కాదు. కొద్దిమంది మిత్రులు ప్రసం గాలు రికార్డు చేసారు. కాన, ఆ ఉపన్యా సాలు, వాటి  సారాన్ని తర్వాత అందజేస్తారు. చెలికాని రామారావు స్మారక సమితి ఆద్వర్యంలో అనుకోకుండా చేసినా సంతృప్తి కరంగా జరిగిన  కార్యక్రమం కోసం ఇప్పటికిలా సంక్షిప్త రైటప్ !)**

# మంచి సినిమా కోసం ఓ ప్రయత్నం




**(తెలుగు రాష్ట్రాలలో మొట్టమొదటిసారిగా పూర్తిస్థాయిలో ప్రత్యామ్నాయ సినిమా ప్రచారోద్యమమే లక్ష్యంగా ఫిలిం ఫెస్టివల్ జరిగి సరిగ్గా ఏడాది. అప్పట్లో మంచి సినిమా గ్రూప్ కోసం రాసిన ప్రోగ్రెసివ్ ఫిలిం ఫెస్టివల్ సంక్షిప్త రిపోర్టు)**

ఇప్పటికీ ఫోన్ లు వస్తూనే ఉన్నాయి. 11వ తేదీ కార్యక్రమం హోరులోంచీ నా లాగే తేరుకోని మిత్రులు చాలా మందే ఉన్నారు. విజ్ఞాన వేదిక ప్లీనరీకనీ, సాహితీ స్రవంతి సభకనీ ఆగిపోయిన వారంతా కాల్ చేసి మరీ బాధపడుతున్నారు. ముంబాయి, కోల్కతా, హైదరాబాద్, తిరుపతి, ఒంగోలు, విజయవాడ, విశాఖపట్నం, శ్రీకాకుళం, విజయనగరం, అనకాపల్లి, రాజమండ్రి, కాకినాడ..... తదితర ప్రాంతాల నుండి ఇంత మంది మిత్రులు రావడం పదకొండు అరుదైన చిత్రాలు చూడ్డం తోపాటు ప్రజా ఉద్యమాల్లో దశాబ్దాలుగా క్షేత్రస్థాయిలో పనిచేస్తూన్న భిన్న శ్రేణులకి చెందిన సామాజిక కార్యకర్తల్ని ఒక్క చోటే కలుసుకోవడం, వారితో భావాలు పంచుకోవడం, వందమంది పైచిలుకు స్వచ్ఛందంగా విచ్చేసిన విద్యార్థులు, ఉపాధ్యాయులు, సాంస్కృతిక కార్యకర్తలు, ఇంకా సినీ పరిశ్రమ నిపుణులు అంతా కలిసి సమిష్టిగా సినిమాలు చూడటం, చాలా ఉత్సాహంగా చర్చల్లో పాల్గోవడం నా లాంటి అనేక మంది కి కొత్త ఉత్సాహాన్నిచ్చింది. ముఖ్యంగా, విదేశీ భాషా చిత్రాలు అర్ధం చేసుకోగలరా అని ఏ మూలనో నాకున్న బెరుకుని పటాపంచలు చేస్తూ ఒక్కొక్క సినిమాకీ పదుల సంఖ్యలో స్పందించారు. ఒక ఖాళీ డబ్బా పెట్టి అభిప్రాయాలు రాసి చీటీలుగా అందులో వెయ్యమన్నాను. ఏదో ప్రయోగాత్మకంగా చేద్దామనే తలంపే తప్పా ఎందరు స్పందిస్తారోననే సందేహం ఉంది. ఇంటి కొచ్చి డబ్బా చించి చూద్దును కదా...అరవైకి పై బడి అభిప్రాయాలు రాసారు. చాలా నిక్కచ్చిగా, నిజాయితీగా..

“ఈ కార్యక్రమానికి రాకపోయుంటే మాకు జీవితంలో మంచి సినిమా అంటే తెల్సేది కాదండీ...”

“ ఈ సినిమాలు చూసాక మేం చాలా గొప్పవని ఫీలౌతున్న చిత్రాల స్థాయి తెలిసొచ్చిందండీ..”

“ సమావేశానికొచ్చి అసలు సినిమా ఎలా చూడాలో నేర్చుకున్నానండీ..”

“ ఇంత వినూత్న ప్రయోగాలు, విభిన్నమైన చిత్రాలు, విస్తృత చర్చలు ఇప్పటివరకు చూడలేదండీ...”

“ ప్రతీ జిల్లాలో, స్కూల్స్, కాలేజీల్లో వీలైనంత ఎక్కువగా ఈ కార్యక్రమం నిర్వహించాలండీ...”

నూట ఇరవై ఐదు మందికి పైగా పాల్గొన్న ఫెస్టివల్ లో ఎనభై మంది కొత్త వాళ్ళొచ్చారంటే మంచి కళ కోసం మనుషులు ఎంత తపిస్తున్నారో అర్ధం చేసుకోవచ్చు. ఫిలిం సొసైటీలు మొదలుకుని, ఫెస్టివల్స్ వరకూ కాల్ చేస్తోన్న మిత్రులు అడుగుతున్నారు కానీ వాట్సప్, ఫేస్‌బుక్ లో ఈ కార్యక్రమం తో పోల్చుకుని తొందరపాటు నిర్ణయాలు తీసుకోవద్దని చెప్పాను. పుస్తకాలు పంపుతానన్నాను. చివరగా , ఇంత మంచి కార్యక్రమం విజయవంతమైందంటే దానిక్కారణం మంచి సినిమా గ్రూప్, సభ్యులుగా మీ అందరి నైతిక మద్దతు, సహకారం. ఎక్కడెక్కడనుండో స్వచ్ఛందంగా వచ్చిన వాళ్ళూ, వాళ్ళు రాలేకపోయినప్పటికీ వాళ్ళ స్నేహితులు, పరిచయస్తులు, ప్రజా సంఘాల వారికి సమాచారాన్ని పంపించి ప్రోత్సహించినవారూ, కార్యక్రమానికి అన్ని విధాల సహకరించిన స్టాలిన్ వంటి పెద్దలూ, మిత్రులు , శ్రేయోభిలాషులందరకీ మరొక్కసారి పేరుపేరునా ధన్యవాదాలు. మళ్ళీ ఇంత కార్యక్రమం చేయడానికి మీ ప్రోత్సాహమే మనోబలం.








# మానవాళి వికాసమే విజ్ఞాన మార్గం

## రేవతి సైన్స్ ఫౌండేషన్ పురస్కారం




Truth is what stands the test of experience.

- Albert Einstein.

(The Law of Science And The Law of Ethics,
The Radical Humanist,April 24,1955.)

"నేను వింటాను, కానీ మర్చిపోతాను.
చూసైతే జ్ఞాపకం ఉంచుకుంటాను.
అదే చేస్తే బాగా అర్థం చేసుకుంటాను !"

రెండు పదుల వయసు దాటిన కన్న కూతురు హఠాత్తుగా మరణించడం ఆ కుటుంబానికి తేరుకోలేని దుఃఖాన్ని మిగిల్చింది. అయితే, ఆ బాధని సమాజం పట్ల బాధ్యత గా మార్చుకుని ఎదిగిన ప్రతీ అమ్మాయిలోనూ తమ కూతుర్నే చూసుకుంటూ, నిత్య జీవితంలో వైజ్ఞానిక స్పృహ కల్పించడం ద్వారా విద్యార్థుల్లో ఆత్మ విశ్వాసం పెంపొందించడానికి అవిశ్రాంతంగా కృషి చేస్తున్న ఒక సాధారణ ప్రభుత్వ ఉపాధ్యాయుడు, కొద్దిమంది విద్యార్థులు, సామాజిక కార్యకర్తలు, ఇతర అధ్యాపకులతో కలిసి స్థాపించిన ఒక సంస్థ ఈ రోజు సైన్సు కోసం మహోన్నతమైన కార్యక్రమాలు రూపొందించే దిశగా ఎదిగింది. ఆ సంస్థ పేరు 'రేవతి సైన్స్ ఫౌండేషన్',దాని వ్యవస్థాపకులు శ్రీకృష్ణసాయి దంపతులు !

భౌతికంగా మరణించిన తమ పెద్దకుమార్తె రేవతి పేరుతో స్మృతి చిహ్నంగా ఈ సంస్థ ను ఆరేళ్ళక్రితం 2018 లో విద్యార్థుల్లో,ముఖ్యంగా బాలికల్లో వైజ్ఞానిక స్పృహ కోసం ఆసక్తి, అవగాహన కల్పించే మానస పుత్రిక (Brain child)గా మలిచడం జరిగింది. ఆనాటి నుండి ప్రపంచవ్యాప్తంగా మానవాళి పురోగతి కోసం పాటుపడిన విశిష్ట వ్యక్తులు, శాస్త్రవేత్త లు, సామాజిక ఆలోచనాపరుల గురించిన ప్రచారోద్యమాన్ని విద్యార్థుల్లో

కలిగించడమే లక్ష్యంగా వివిధ కార్యక్రమాల్ని వినూత్నంగా రూపొందిస్తున్నారు. జ్ఞానమనేది కేవలం తరగతిగదులకి పరిమితం కాదని, బోధన వల్ల, వినికిడి, దృశ్య మాధ్యమాల వల్లా పిల్లలకి అందేది సమాచారం తప్పితే జ్ఞానం కాదనీ, నిజమైన జ్ఞానానికి అనుభవమే ప్రమాణమనీ, తప్పొప్పుల బేరీజు తేలాల్సింది ప్రయోగంతోనే అనే ఆలోచన లోంచి రూపుదిద్దుకున్నదే ఈ విశిష్ట వైజ్ఞానిక సంస్థ !

అందులో భాగంగా గత ఆరేళ్ళుగా జాతీయ బాలికా దినోత్సవం సందర్భంగా తెలుగు రాష్ట్రాల్లో అనేక ప్రాంతాల నుండే కాక జిల్లా వ్యాప్తంగా పలు విద్యాసంస్థల నుండీ ఎందరో ఔత్సాహిక బాలికలతో చిన్న వయసు నుండే వారిలో ప్రశ్నించే తత్వాన్ని, సత్యాసత్య వివేచనా పద్ధతిని, హేతుబద్ధ ఆలోచనా విధానాన్ని పెంపొందించేలా విజ్ఞాన ప్రదర్శన (%ూఎఱ-వఅఎవ ఖీఱఅతీ%)ని ఏర్పాటు చేయడం వాటిల్లో ఒకటి. ఎక్కడెక్కడి నుండో వచ్చే విద్యార్థులు స్వంతంగా చేసిన అనేకానేక సైన్సు ప్రయోగాల్ని, సరికొత్తగా ఆవిష్కరించే శాస్త్ర నమూనాలనూ ప్రదర్శించడంతో పాటు, సైన్సు పట్ల ఆరోగ్యకర దృక్పథాన్ని నిర్మించడం, చిన్నారులకు విలువలతో కూడిన చింతనాత్మక జీవన విధానం పట్ల గౌరవభావన కల్పించడం ఈ కార్యక్రమం ప్రధానోద్దేశం. విజ్ఞానాభిలాష విజయాప జయాలకి అతీతమని గుర్తిస్తూనే, ప్రతిభ కనబర్చిన చిన్నారుల్ని ప్రోత్సహిం చేందుకు అందిస్తోందే రేవతి సైన్స్ ఫౌండేషన్ అవార్డు !

విశిష్ట మహిళా శాస్త్రవేత్త మేరీక్యూరీ స్ఫూర్తితో, కేవలం సైన్సునమూనాలకే పరిమితం కాకుండా, శాస్త్ర ప్రయోజనం సమాజ ఉన్నతితో మాత్రమే ముడిపడి ఉంటుందనే స్పష్టతను చిన్నారులకి కల్పిస్తూ, వారిలో సాంస్కృతిక వికాసం దిశగా కూడా కృషి చేస్తూ ఐన్ స్టీన్ మొదలుకొని డార్విన్ వరకూ, ఎడిసిన్ నుండి న్యూటన్ దాకా, జగదీస్ చంద్రబోస్తో మొదలెడితే సి. వి. రామన్ దాక మేధస్సుని మానవాళి ఉన్నతి కోసం ఉపయోగించిన మహామహుల జీవితం గురించి చిన్నారులతో చిరునాటికల ప్రదర్శన (మోనో యాక్షన్)వంటి రూపకాలు కూడా ఇక్కడ చిన్నారులే ప్రదర్శిస్తారు!



ప్రజల కోసమే సైన్సు అనే అవగాహనతో పని చేస్తున్న జన విజ్ఞాన వేదిక, రామానుజన్ మ్యాథ్స్ అకాడమీ, చెలికాని రామారావు స్మారక సమితి, సంగమం తదితర అనేక సంఘాలతో కలిసి సంవత్సరం మొత్తంలో  పిల్లలు, పెద్దల్లో శాస్త్రీయ స్పృహ పెంచేలా పదుల సంఖ్య లో వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తున్నప్పటికీ, బాలికా దినోత్సవం నాడు ప్రత్యేకంగా బాలికల కోసమే ఏర్పాటు చేసే ఈ వైజ్ఞానిక ప్రదర్శన నాకు తెలిసీ రాష్ట్రంలోనే ప్రత్యేకత కలది. వ్యక్తిగత ఆసక్తి, పూర్వ విద్యార్థుల సహకారం, శ్రేయోభిలాషుల ప్రోత్సాహంతో గతించిన కుమార్తె స్మృతుల్ని వందలాది మంది పిల్లలు సాధిస్తోన్న శాస్త్ర సాధికారతలో చూసుకోవడం కృష్ణసాయిగారి దార్శనికతకి నిదర్శనం !

అందుకనే వెనుదీయని సంకల్పంతో ఎందరో సైన్సు ఆలోచనాపరులు, విజ్ఞానశాస్త్ర ప్రముఖుల సమక్షంలోతో పిల్లలకోసం ఎప్పటికప్పుడు ప్రదర్శనల్ని, ప్రసంగాల్ని , కార్యశాలల్నీ ఏర్పాటు చేయడం, విద్యార్థి దశలోనే పిల్లల్లో మానవీయ వైజ్ఞానిక నైతిక జీవన విధానాన్ని ఏర్పర్చే దిశగా వారికి ప్రోత్సాహక బహుమతులు అందించడం, ఆ క్రమంలోనే సొంత ఖర్చుతో తన ఇంట్లోనే  భావితరాలకు సైతం ప్రయోజనం చేకూర్చేలా 'రేవతి సైన్స్ సెంటర్' ఏర్పాటుకు నడుం బిగించడం వంటివి నాకు తెలిసీ ఒక సామాన్య ఉపాధ్యాయుడిగా ఆయన చేస్తోన్న అసామాన్య యత్నాలే !

ఏ సమాజ ఉన్నతికయినా పౌరసమాజం లోని వైజ్ఞానిక దృష్టే ప్రమాణం. దానిని హేతుబద్ధంగా మల్చుకోవడమే నాగరిక వ్యవస్థల లక్ష్యం కావాలి. ప్రజాస్వామ్య ప్రభుత్వాలకి ఉండాల్సిన మౌలిక భావనల్లో అదొకటి. అందుకనే బాబా సాహెబ్ అంబేద్కర్ వైజ్ఞానిక స్పృహను, మానవవాద భావనను రాజ్యాంగబద్దంగా ప్రతి పౌరుడికీ కల్పించాలంటాడు. ఆయన ఆశయాల  సాధనలో భాగంగా డా. బి. ఆర్. అంబేద్కర్ కోనసీమ జిల్లా ఏర్పడిన తరువాత మొట్టమొదటి సారిగా జరిగిన బాలికల వైజ్ఞానిక ప్రదర్శన ఆ మహోన్నత ఆకాంక్షలకి అద్దం పట్టింది. ప్రదర్శనలో ఎంతో ఉత్సాహంతో పాల్గొన్న పసి మనసుల సాక్షిగా,  ఈ దేశంలో మానవీయ విజ్ఞాన పరంపరని సుస్థాపితం చేయగల అజేయమైన శక్తి రేపటి మహిళలుగా ఈనాటి ఈ బాలికలకే ఉందనిపించింది !

(కవీ, తత్వవేత్త, చరిత్రకారుడూ అయిన వైజ్ఞానిక వైతాళికుడు ఫ్రాన్సిస్ బెకన్ జయంతి రోజున డా. బి. ఆర్. అంబేద్కర్ కోనసీమ జిల్లా రామచంద్రాపురం కేంద్రంగా రేవతి సైన్స్ ఫౌండేషన్ నిన్న (22- 01 - 23, ఆదివారం) వెంకటాయపాలెం లో నిర్వహించిన బాలికల సైన్స్ ఫెయిర్ ని చూస్తే చాలా ఆనందం కలిగింది. అంత మంది పిల్లలు ఎంతో చురుగ్గా వారి వారి నమూనా ల్ని ప్రదర్శిస్తూ, వచ్చిన సందర్శకు లకి వాటి గురించి వివరిస్తూ చెప్పిన తీరు ముచ్చట గొల్పింది. భవిష్యత్తులో ఇలాంటి మరిన్ని నిర్మాణాత్మక

కార్యక్రమాలకి రేవతి సైన్స్ ఫౌండేషన్ వేదిక అవ్వాలనీ, పిల్లల్లో వైజ్ఞానిక స్పృహనూ, సత్యాన్వేషణా పద్ధతుల్ని పెంపొందించేలా మరిన్ని ప్రోత్సాహక ప్రదర్శనలు ఏర్పాటు చేయాలని మనస్ఫూర్తిగా ఆశిస్తూ, నిర్వహకులకి, సందర్శకులకి, ప్రోత్సాహకు లకి ప్రత్యేక అభినందనలతో ఈ చిన్న రైటప్.)



# ఆలోచనలు పంచుకుందాం !

## ఉన్నతమైన మార్గాల్ని ఎంచుకుందాం !!

"సంగమం సాంస్కృతిక వేదిక".

(చల్లా వెంకట్రావు గారి 16వ వర్ధంతి)





" వ్యవస్థలో ప్రజల అవస్థలు - చేయగలిగిన చిన్న ప్రత్యామ్నాయాలు :మన అనుభవాలు -ఆలోచనలు." ఇంత సుదీర్ఘమైన సమాలోచన కార్యక్రమం డిజైన్ ఐతే చేయగలిగాం కానీ ఎలా నిర్వహించాలో అనే ఉత్సుకత చివరిదాకా ఉంది. క్రియాశీలకంగా పని చేస్తున్న పలు స్వరాల సమిష్టి సమాహారంగా సమాలోచనను మలచడం చెప్పినంత సులభం కాదు !

ఒక కార్యక్రమం, మామూలు వక్తలు ప్రసంగాల శైలిలో కాకుండా ఒక వర్క్‌షాప్ (కార్యశాల) మోడ్‌లో చేస్తే ఎలా ఉంటుంది ? ఒకట్రెండు కాదు, ఏకంగా పదిహేను అంశాలు. అందులో పన్నెండు మంది విభిన్న సమస్యల గురించి ఈసరికే పని చేస్తున్న నిపుణులు. మనిషికి గరిష్ఠంగా పావుగంట, ఇరవై నిమిషాల వరకూ అనుకున్నాం. ఐనా సరే, మనసులో ఎక్కడో చిన్న బెదురు !

ఏదో తరలింపు కార్యక్రమంలా కాకుండా ఒక హృద్యమైన ప్రత్యామ్నాయ సంస్కృతికి ఆద్యంగా భావిస్తూ డా. చల్లా రవికుమార్ గారు తీసుకున్న ఈ నిర్ణయం సాహసోపేతమైనదే. కానీ, ఎంతకాలం నుంచో ఆయనలో సాగుతూ,నిద్రలేకుండా రగులు తున్న మానసిక కాంక్షకి మొత్తానికి తొలి అడుగు బలంగానే పడింది. శక్తివంతంగానే ముందుకు కదిలింది. అందుకు ఈ కార్యక్రమమే ఉదాహరణ !

సైన్సు, పర్యావరణం, వ్యవసాయం, సహకార రంగం,పిల్లలతో అనుభవాలు, ఉపాధ్యాయుల ధోరణి, ప్రపంచీకరణ, ప్రజాసంఘాల తీరు, జండర్ ఒకటా రెండా ఏకంగా పదికి పైబడిన విభిన్న అంశాలలో అద్భుతంగా మాట్లాడిన వాళ్ళు. అది కాదు ఆశ్చర్యం, అంతే సంఖ్యలో స్పందించి, ప్రశ్నలు సంధిం చిన మరో పదిమంది సభ్యులు. ఇది కదా నిజమైన సమాలోచన అంటే అనిపించింది !

విభిన్నమైన మానవీయ కోణాల్ని ఆధారంగా చేసుకొని ప్రజాహితం కోసం వాళ్ళ పరిమితు



ల్లో పని చేస్తున్న మన చుట్టుపక్కల కొద్ది మందిని పరిచయం చేస్తూ, వాళ్ళు అవలంబి స్తున్న ప్రత్యామ్నాయ పద్ధతుల్ని వాళ్ళ మాటల్లోనే చర్చకు పెట్టడం మా ఉద్దేశం. ఆ దిశగా సాగిన ఈ కార్యక్రమం నాకు తెలిసీ ప్రయోగాత్మక ఒరవడికి ఒక ఆచరణాత్మక ప్రతీకగా నిలిచింది!

ఉదయం పదింటికి ఆలమూరులో మొదలైన కార్యక్రమం మధ్యాహ్నం గంట భోజన విరామం తో సాయంత్రం ఏడింటి వరకూ సుమారు పాతిక మంది ఆలోచనాపరులు, ప్రజాపక్ష బుద్ధిజీవులు, సామాజిక కార్యకర్త లతో జరగడం నిజంగానే ఆశ్చర్యం. సమయా భావం వల్ల ఒకట్రెండు అంశాల్ని తప్పా మిగతా అంతా కచ్చితంగా అనుకున్నట్లే నిర్వహించడం జరిగింది !

కట్టా కృష్ణారావు, కృష్ణసాయి, రాజేంద్ర, రవి, మృత్యుంజయరావు, లెనిన్, పవన్, రామకృష్ణా రావు, సుమతి, లక్ష్మణరావు, మల్లికార్జునరావు,కె.వి.వి. సత్యనారాయణ, సిద్ధూ, శ్యాం, స్వామి ప్రసాద్, ప్రేమానందం, సాయి, సుభాష్, లక్ష్మి, కళ్యాణి, తాతారావు దాదాపు 25 మంది ఒకేరోజు ఆలోచనల్ని ఆత్మీయంగా పంచు కోవ డం మావంటి వాళ్ళకి కొత్త ఉ త్తేజాన్నిచ్చింది !కమ్యూనిస్టు పార్టీలో మొట్టమొదటి సారిగా ఎరుకులతో మమేకమై వారికి గుర్తింపు కార్డులు వచ్చేలా పోరాటం చేసి, 'నేరస్త కులంగా' వారిపై ఉన్న ముద్రకి వ్యతిరేకంగా పోరాటం జరిపి, వాళ్ళ కోసం ఒక ప్రజాపక్ష నాయకులతో మాట్లాడి కాలనీ నిర్మించే వరకూ శ్రమించని చల్లా వెంకట్రావు గారి కోసం ఆయనతో కలిసి పనిచేసిన కామేడ్స్ చెప్తుంటే వినడం గొప్ప స్ఫూర్తి ! అణగారిన వర్గాల ప్రజల కోసం రాత్రిబళ్ళు నడిపినా, వ్యసనాలు మాన్పించడానికిపనిచేసినా, రైతాంగ సమస్యల పై పోరాడినా, హోమియోపతి వైద్యునిగా మారినా, గోదావరి జిల్లాలో ప్రజాపక్ష బుద్ధిజీవిగా, క్షేత్రస్థాయి కార్యకర్తగా అవన్నీ చల్లా వెంకట్రావు గారి వ్యక్తిత్వంలో భాసించిన అంశాలే. చాతనైన కార్యాచరణలో భాగం కావడమే ఆయనకు నిజమైన నివాళి !

**(ప్రత్యేకంగా ఈ కార్యక్రమం రూపకల్పన నుండీ చివరివరకూ అనేక రకాలుగా చర్చిస్తూ వచ్చిన నాకు జరిగిన తీరుతో ఒక రిలీఫ్. సమాలోచనకి మోడరేట్ చేస్తూ సమన్వయకర్తగా వ్యవహరించిన నాకు సంతృప్తి కలిగింది. ఐతే, ఎప్పుడూ చూడా ల్సిన తీరాలు, చేరాల్సిన గమ్యాలు ఉంటూనే ఉంటాయి. అలా ఉండ టమే సమాజానికి ఆరోగ్యమనే అభిప్రాయంతో కార్యక్రమానికి సంబంధించీ ఈ చిన్న రైటప్ !)**

# ముగింపు

To treat life as less than a miracle is to give up on it

Wendell Berry

మనిషి ఆశయాలకి మరణమే ముగింపు కాదు. మిత్రుడు, సంభావనా సంస్థలో చాలా కాలం పాటు సభ్యుడూ, Himachal Queer Collective వ్యవస్థాపక సభ్యుడు 'శశాంక్' ఆత్మహత్య మానసికంగా నన్ను కుదిపేసింది.

డీర్‌పార్క్‌లో Dances For Universal Peace అనే అంతర్జాతీయ కేంప్‌లో పాల్గొని కూడా పక్కనే ఉన్న సంభావనకి వెళ్ళకుండా వెనక్కి తిరిగి వచ్చేసాను. ఎంతోకాలం నుండి మనసులో తచ్చాడుతున్న భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్, బటుకేశ్వర్ దత్, విద్యావతీ దేవిల స్ఫూర్తితో నిండిన నేల 'ప్రేరణా స్థల్' కు పాకిస్తాన్ సరిహద్దులో ఉన్న హుస్సెన్‌వాలా గ్రామానికి వెళ్ళి గడపడం ఒక సాకారం. ఆ మాటకొస్తే రాజ్యం చేత అప్రకటితంగా హత్య చేయబడిన ప్రొఫెసర్ సాయిబాబా మరణానంతరం కూడా అసంఖ్యాక సభలు, సమావేశాల్లో ఆలోచనను రగిలిస్తూనే ఉన్నాడు. ఎందుకనో హఠాత్తుగా జెఫ్ నేబిల్ గుర్తొచ్చాడు.

ఎక్కడో అమెరికాలో పుట్టి సౌకర్యవంతమైన ఉద్యోగాన్నొదిలి పెట్టి చైతన్యోద్యమ బాట పట్టాడు. ఈ దేశం మట్టితో మమేకమై నడిచి గాంధేయవాదిగా ఎదిగాడు. ఎన్నో దేశాలు, అక్కడి ప్రజలు, వారి సంస్కృతుల్ని మనిషిగా మారి ఆవాహన చేసుకున్నాడు. భారతీయ పౌరుడిగా బతికి, చివరికి అమెరికా మొదలు వ్యవస్థలో పెరిగిన "క్రూరత్వాన్ని" సహించలేక తనని తాను దహించుకుని ప్రపంచాన్ని వదిలిపెట్టి సెలవంటూ వెళ్ళిపోయాడు.

జైపూర్ దగ్గర బౌద్ధ క్షేత్రంలో 2011 లో ఆత్మహత్య చేసుక్నున్న నేబిల్ తన చివరి లేఖలో రాసిన ఆ Cruel Incidents ఏమిటి ? మనుషులుగా మనం పెంపొందించుకోవల్సిన ఆ 'దగ్గరితనం' ఎందుకు రోజురోజుకు 'దూరం' అవుతోంది. 'స్పృహ'తో ఉనికిని ఆస్వాదించినసందర్భాలు ఎందుకు రానురాను కుదించుకు పోతున్నాయి? మనుషుల మధ్య మాధ్యమంగామారాల్సిన ప్రేమాభిమానాలు, ద్వేషరాహిత్యంఎందుకు మాయమైపోతున్నాయి? భారతీయ తాత్విక స్రవంతిలోని అనేకానేక చారిత్రక మానవీయ ధోరణులు మనిషిలోని ఈ 'ఖాళీల్ని' పూరించే ప్రయత్నం చేసాయి. ప్రత్యామ్నాయ విధానాలను రూపొందించాయ్. కాకపోతే, మనకు ఆయా మార్గాల గురించిన చర్చలు జరగాల్సినంతగా జరగలేదు. ఆ తరహా రచనా వ్యాసంగం ఊసే లేదు. ప్రతీ ఉన్నతమైన ప్రయత్నం పట్లా అసంతృప్తితో కూడిన కోపం, చులకన భావం భారతీయ మనస్తత్వ లోపాలు.

“The Sufi sees the truth in every religion “ అంటాడు ప్రపంచ దేశాల్లో ప్రఖ్యాత సంగీతకారునిగా, సూఫీవేత్తగా గుర్తింపు పొందిన ఇనాయత్ ఖాన్. విద్వేషానికి విరుద్ధంగా జీవితాంతం పోరాడిన సరిహద్దు గాంధీ ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ My Life and Struggle పేరిట రాసిన స్వీయచరిత్రలో ఏమన్నాడో చూడండి.

My religion is truth, love and service to God and Humanity. Every religion that has come into the world has brought the message of love and brotherhood. And those who are indifferent to the welfare of their fellowmen, those whose hearts are empty of love, those who do not know the meaning of brotherhood, those who harbour hatred and resentment in their hearts, they do not know the meaning of Religion.

- Khan Abdul Gaffar Khan

My Life and Struggle

Autobiography - page : 195

“ప్రేమ, సత్యం, మనిషికి,దేవుడికి సేవ చేయడమే నేను అనుసరించే మతం. ప్రపంచంలో పుట్టిన ప్రతి మతమూ ప్రేమనీ, సౌభ్రాతృత్వాన్నే సందేశంగా వెలువరించాయ్. ఎవరైతే సాటి మనుషుల సంక్షేమాన్ని స్వాగతించలేరో, ఎవరిహృదయాల్లో ప్రేమకి స్థానం ఉండదో, సౌభ్రాతృత్వం అంటే ఎరగరో, ఇంకా గుండెల్లో ద్వేషాసూయలతో, పగ, ప్రతీకారాలతో రగిలి పోతుంటారో అలాంటి వారికసలు మతం అనే పదం యొక్క అర్థమే తెలీదు.” )

**ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్**

**నా జీవన పోరాటం (ఆత్మకథ)**

నాగరికత పేరిట అమానవత అవాంఛనీయ ప్రభావాలను కలిగిస్తున్న సమయంలో దుఃఖిత పీడిత ప్రజల పక్షాన నిలవగలగడమే ‘మనిషి’ కర్తవ్యం కావాలి. ఆధిపత్యానికి వ్యతిరేకంగా అన్ని దిశల్లోని ప్రజాతంత్ర స్వరాలు సమిష్టిగా కలవడమే ఆదర్శ మానవుడి స్వప్నం అవ్వాలి. అదిగో అలాంటి ఒక సంక్షేమ సమ సమాజాన్ని కాంక్షించే దిశగా కించిత్తు కార్యాచరణను మలుచుకోవడమే మన లక్ష్యం. అందులో భాగమే ఇది. ప్రవహిస్తున్న ఇంక్విలాబ్ నది.

## మా ఇతర ప్రచురణలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏమిటి ?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్థిత్వం - అరాజకత్వం
7. మద్యం పై యుద్ధం
8. మతానికి మరణశాసనం...
9. కరపత్రాల కథా కమామీషు
10. తత్వ విచారణ : తర్క వివేచన
11. కులానికో సవాలు
12. హేతువాద దృక్పథం: విధానపర కర్తవ్యం
13. కలాలు - కరపత్రాలు
14. ప్రకృతి - శాస్త్రం - సమాజం
15. పార్టీరహిత ప్రజాస్వామ్యం
16. శిథిలాక్షరం
17. వ్యవస్థలు - వ్యసనాలు
18. ప్రజా ఉద్యమాల ప్రాతిపదిక
19. తరగతిగది తత్వశాస్త్రం
20. అభివ్యక్తి
21. భారతదేశ పతనానికి ప్రధాన కారణం:కులం
22. మహా మానవవాద తత్వవేత్త - మానవేంద్రనాథ రాయ్
23. ఆకాశమంత అక్షరమూర్తి - డా. ఆవంత్స సోమసుందర్ (శతజంత్యుత్సవ వ్యాస సంపుటి)
24. వాక్కులు - వాక్యాలు (పది ప్రసంగ వ్యాసాలు)

## ఇంటర్వ్యూలు - పరచయాలు

25. ధిక్కార స్వరాలు
(భావోద్యమకారుల ఇంటర్వ్యూలు)
26. విస్మృత స్వరాలు

(గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)
27. సద్ధమ్మ స్వరాలు
(బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)
28. దీరోధాత్తులు
(కొద్దిమంది సామాజిక కార్యకర్తల పరిచయాలు)
29. సాఫల్య జీవులు
(మహానుభావుల పై ప్రసంగ వ్యాసాలు)
30. మరువలేని మనుషులు:మరపురాని జ్ఞాపకాలు
(కొందరు గతించిన ఆత్మీయుల స్మృతులు)
31. రాజీలేని ధిక్కార పతాకాలు
(కొద్దిమంది సామ్యవాదుల పరిచయాలు)
32. మరుగునపడ్డ మహాయోధులు
(కొద్దిమంది ప్రజాపక్ష బుద్ధిజీవుల పరిచయాలు)
33. ఇరువురు ఏకవ్యక్తి సైన్యాలు (విశిష్ట భావోద్యమ దంపతుల పరిచయం)
34. నిత్య చైతన్య భావోద్యమ తరంగం - దేవగుప్తపు పేరలింగం (నివాళి ప్రచురణ)
35. మార్గదర్శకులు (కొందరు మంచిమనుషుల పరిచయాలు)
36. మహామానవులు (కొద్దిమంది జిజ్ఞాసుల పరిచయాలు)
37. భావజాల సౌధాలు (కొన్ని మానవీయ సంస్థల పరిచయాలు)

## అనువాదాలు - అనుసరణలు

38. నీటిమరల గ్రామం
(అకిరా కురుసోవా విలేజ్ ఆఫ్ వాటర్మిల్స్ కి తెలుగు అక్షర రూపం)
39.పురుషుడు - స్త్రీ
(చలం ఏకైక ఆంగ్ల వ్యాసం తెలుగులో)
40. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా..
(లోక్నాయక్ జయప్రకాశ్ నారాయణ్ వ్యాసం )
41. శాస్త్రీయ హేతువాద సామ్యవాది : వివేకానంద
(దత్తప్రసాద్ దభోల్కర్ రచన అనువాదం)
42. సాలీడు - ఈగ
(విలియం లబ్నిష్క్ పిల్లల కథ తెలుగులో)

43. నంది మూపురం
(డి.డి.కొశాంబి పిల్లల కథ తెలుగులో)
44. ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో..
(విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ కవితా విశ్లేషణ)
45. చారిత్రక మహెూద్యమం : చంపారన్ సత్యాగ్రహం
(చంపారన్ శతవార్షికోత్సవ వ్యాసాలు)
46. సాంస్కృతిక ఆవశ్యకతగా స్వేచ్ఛ
(యం. యన్. రాయ్ వ్యాసం తెలుగులో)
47.మన విద్యా సమస్య
(లాలా లజపతిరాయ్ వ్యాసం)
48. జీవితానికి అర్థం ఏమిటి ?
(ఆచార్య నరేంద్రదేవ్, లోహియా వ్యాసాలు)
49.ప్రకృతి శాశ్వత ప్రగతి
(సుందర్లాల్ బహుగుణ ఇంటర్వ్యూ)
50.అభివృద్ధి - ఆదివాసులు - హింస
(హిమంశుకుమార్ హిందీ రచన తెలుగులో)
51. మనిషి - మార్జాలం
(కానర్డ్ లోర్నెంజ్ పిల్లి కథ)
52. సినిమా కార్యకర్తల కరదీపిక
(ఏ మాన్యువల్ ఫర్ ఫిల్మ్ స్క్రీనింగ్ తెలుగులో)
53. నేను - ప్రజలు - ప్రపంచం
(పిఠాపురం యువరాజా ఆత్మకథ తెలుగులో)
54. భారతదేశంలో బౌద్ధ పతనం
(అంబేద్కర్, రాహుల్జీ ల వ్యాసాలు)
55. అనారోగ్యాన్ని పండగ చేసుకుందాం
(తమిళ నమ్మల్వార్ రచన అనువాదం)
56. భారతదేశ విముక్తి మార్గం: బౌద్ధం
(డా.బి.ఆర్.అంబేద్కర్ ఐదు బౌద్ధ ప్రసంగాలు)
57.పర్యావరణ పరిరక్షణ
(సుందర్లాల్ బహుగుణ రచన)

58. మన కర్తవ్య మార్గం
(గదర్ వీరుడు సోహన్ సింగ్ భాక్నా రచన)
59. సైన్స్ అంటే ఏమిటి ?
(వినోద్ రైనా, డి.పి. సింగ్ రచన తెలుగులో)
60. ఆర్.వి.కె.యం.సూర్యరావు బహదూర్
(పిఠాపురం మహారాజా జీవినచక్రం)
61. మహాత్మాగాంధీ
(ప్రొ. సచ్చిదానంద సిన్హా వ్యాసం తెలుగులో)
62. ప్రజాపక్ష మేధావి కొశాంబి
(అరవింద్ గుప్తా రచన తెలుగులో)
63. నాకో భార్య కావాలి !
(అమెరికన్ స్త్రీవాద రచయిత్రి జడీబ్రాడీ వ్యంగ్య రచన తెలుగులో)
64. ప్రజావిముక్తి ప్రదాత : డా. బి. ఆర్. అంబేద్కర్ (డా. భదంత ఆనంద్ కౌసల్యాయన్ వ్యాసం)
65. అసాధారణ ఆలోచనాపరుడు, ముస్లిం సత్యశోధక్ మండలి స్థాపకుడు : హమీద్ దల్వాయి (50 ఏళ్ళ నాటి విశిష్ట ఇంటర్వ్యూ)
66.ఈనాటి పీడితుల కోసం బీ వీర్ నారాయణ్ సింగ్ వీలునామా (అమరుడు శంకర్ గుహ నియోగి పరిశోధనాత్మక చారిత్రక రచన)
67. అమరుడు భగత్‌సింగ్ ( కామ్రేడ్ మన్మధనాథ్ గుప్తా 50 ఏళ్ళ నాటి విశిష్ట రచన)
68. తెర వెనుక...( మొట్టమొదటి భారతీయ కమ్యూనిస్టు, ముస్లిం డాక్టర్ రషీద్ జహాన్ లఘు
నాటిక తెలుగు అనువాదం)

## సేకరణ - కూర్పు - పునర్ముద్రణ

69. ఆంధ్రరాష్ట్ర సాంఘిక సంస్కర్తలు - శతవార్షికోత్సవ సందర్భం
(పి. హెచ్. గుప్తా గారి వ్యాసం )
70. కాకినాడలో ఒక సాంఘిక సంస్కరణ - శతవార్షిక సమాలోచన
(యలమంచిలి వెంకటప్పయ్య గారి వ్యాసం)

## పర్యవేక్షక/భాగస్వామ్య ప్రచురణలు :

71. అద్వితీయ వైజ్ఞానికవేత్త, కీ. శే. యాళ్ళ సూర్యనారాయణ (పార్వతీపురం) విశిష్ట

కృషి :

భావ దీపికలు (నాస్తిక, హేతువాద, భౌతికవాద సూక్తులు)

72. మైత్రేయి బుద్ధవిహార మహానిర్మాత, మహెూ దయ యాజరా రచనా సంపుటి : నన్ను నేను ప్రకటించుకుంటున్నా !

73. రేపటి తరం కోసం మద్యపాన వ్యతిరేక ఉద్యమం (జనవిజ్ఞాన వేదిక ముద్రణ)74. కులనిర్మూలనకై గళమెత్తిన సదస్సు !

75. ఏకవ్యక్తి సైన్యం : మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)

## సంకలనం - సంపాదకత్వం

76. మద్యపానమా? మానవత్వమా?

77. మానవతకు భరోసా

78. సహృదీయం

79. పేదల కలలు (కథలు)

80. సంస్కృతి:సంక్షోభాలు–సంవాదాలు

81. ప్రత్యామ్నాయ సినిమాలు : దృక్పథాలు - దృక్కోణాలు

82. మానవీయ ఆసరా స్వరాలు...

83. భారతదేశ ప్రజలమైన మేము..

(డెబ్బై ఏళ్ళ రాజ్యాంగ విశ్లేషణ వ్యాసాలు)

84. చదువు అంటే ఏమిటి, చదువులెందుకు?

85. ప్రజలు - కళలు

86. భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం

87. నవభారత యువదిక్సూచి భగత్సింగ్

88. కులనిర్మూలన కోసం...

89. పరాయీకరణ :పరిణామాలు - పర్యవసానాలు

90. శ్రమైక జీవన సంస్కృతి

91. ఒకే వ్యక్తి - అనేక జీవితాలు

(రాహుల్జీ పై వ్యాస సంకలనం)

92. మద్యమా ? మానవ మనుగడా?

(మద్య వ్యతిరేక కరపత్రాలు)

93. ప్రజల కోసం పాత్రికేయం : ప్రమాణాలు - ప్రభావాలు

94. పిఠాపురానికి వెలుగురేఖలు (ముగ్గురు మహనీయుల శతజయంత్యుత్సవ పరిచయం.)
95. ఆయన జీవితమే ఒక సందేశం - దరిశి చెంచయ్య (వ్యాస సంకలనం)
96. మనుషులు - వ్యసనాలు (వ్యాస సంకలనం)
97. ఉరిమే స్వేచ్ఛా స్వరం - గరిమెళ్ళ నారాయణ (90 వ జయంతి స్మారక వ్యాస సంకలనం)
98. ప్రజాపక్ష మేధావి - అరుదైన బుద్ధిజీవి : డా. గురుకుల మిత్ర , జీవితం - ఆచరణ - కృషి (వ్యాస సంకలనం)